# కోయిల

పిల్దిభొట్ల సుబ్బరామయ్య



# వసుంధర కథనం

"అదుగో, ఆకనిపించే యిల్లే" అన్నాడు కుర్రవాడు. నేను చేతిలో సంచితో అలాగే ఒక నిమిషం నిలబడ్డాను.

పగలు పదిగంటలు దాటింది. సూర్యబింబం క్రమంగా వేడెక్కుతున్నది. ఎండలో చురుకుపాలు హెచ్చవుతున్నది.

కాస్సేపటిలో గాలి వేడెక్కి ఇక పొద్దుగూకేవరకూ 'స్రరున' వీస్తూ సమస్త ప్రాణికోటినీ హింసిస్తుంది. అప్పుడప్పుడు గాలి బిగిసిపోయి ఆకులు కూడా కదలవు. ఊపిరాడదు. ఉక్కపోసి తల్లడిల్లిపోతాము. అంతలోనే మళ్ళీ దిగంతాలనుంచి నిప్పులమీద నుంచి వీస్తున్నట్టు వేడిగా వీస్తుంది. ఎక్కడో కనరాని లోకాలేవో తగలబడుతూ వుంటే వాటిమీద నుంచి వీస్తున్నట్టు ఉంటుంది గాలి.

రోడ్డు క్రింద గుడిసెలున్నాయి. మధ్యసన్నని దారులు. గుడిసెలలో పుష్కలంగా ఉంటుంది జనాభా. గుడిసెలమధ్య పెంపుడు పందులు అటూ యిటూ హడావిడిగా తిరుగుతున్నాయి. అప్పటికీ యిప్పటికీ ఏమీ మార్పు లేదు. నేను నెమ్మదిగా రోడ్డుదిగి మొదటి గుడిసెముందు ఆగాను. భూదేవి శరీరం మీద లేచిన వ్రణాల్లాగున్న ఆ గుడిసెలలో అదే కొంచెం పెద్దది. ముందు కొద్దిగా ఖాళీస్థలం ఉంది. ఒక చిన్న గన్నేరు చెట్టు బలహీనంగా నిస్తేజంగా పెరిగి ఓపిక లేనిదానిలా ఒక వైపుకు వాలి వుంది. చిన్న పంచలో ఒకవ్యక్తి కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. నా అడుగుల సవ్వడి విని అంతలో కళ్లుతెరిచి చూసి ఆవులించి 'ఎవరూ?' అన్నాడు.

'ఉమగారు ఉండేది ఇక్కడేనా ?' అని అడిగాను.

అతడు మళ్లీ ఆవులించి చిటికె వేసి తలవూపాడు.

నేను సంచీక్రింద పెట్టి 'ఆమెను చూడవచ్చా ?' అని అడిగాను.

'నిక్షేపంగా' అన్నాడతడు. ఆ మాట అని మళ్లీ కళ్లు మూసుకున్నాడు.

బాగా వంగి గుమ్మం అవతల కాలు పెట్టాను. లోపల ఎక్కువ వెలుతురు లేదు. చిన్న వెదురుబద్దల కిటికీలో నుంచి వెలుతురు పడుతున్నది. క్రింద నేలమీద అయిదుగురు పిల్లలు కూర్చుని వున్నారు. వారిలో ఒకడికి చొక్కా మాత్రమే ఉంది. మరొకడికి వంటిమీద నూలుపోగు కూడా లేదు. ఒకపిల్ల బాగా మాసిన పూలగౌను వేసుకుని వున్నది. వీళ్లు ముగ్గురూ ఏడెనిమిదేళ్ల లోపువారు. మిగిలినవారు మరీ చిన్నపిల్లలు. దిసమొలలతో వున్నారు. ఆమె వారి ఎదురుగా కూర్చుని వుంది. చాలా దీక్షగా తన ఎదురుగా నేల మీద ఉన్న కాగితం ముక్కల మీద పెన్సిలుతో ఏదో

వ్రాస్తున్నది. తల బాగా వంచి ఒక మోచెయ్యి నేలమీ ఆనించి ఉండడం వల్ల ఆమె ముఖం కనిపించడం లేదు. నేః గుమ్మానికానుకొని అలాగే నిలబడ్డాను.

అంతలో ఆమె తలయెత్తి 'అమ్మయ్య' అయిపోయిం అన్నది ముందు. ఆ తర్వాత ఆ కాగితం ముక్కలు చేతిలో తీసుకుని సరిచేసుకుని పిచ్చినవ్వు నవ్వుతూ "ఆం! ఇప్పుడ చెప్పండి. ఎవరి కెంత కావాలి ? ఏరా ! లక్ష్మణ కుమారా ఎంత కావాలి నీకు ?" అన్నది. ఆమె కంఠస్వరం ముక్కల ముక్కలుగా తెగిపోతూ వినిపించింది.

పిల్లలలో ఒకడు చెయ్యి పైకెత్తి "నాకు పది కావాలి' అన్నాడు.

"పదివేలా ? ఏం చేసుకుంటావురా ? అంత డబ్బు నీకెందుకు ?" అని అడిగిందామె.

వాడు ఒక్క క్షణం ఆలోచించాడు. అంతలో పెద్దగా "కాఫీ హోటలు పెడతాను." అన్నాడు.

"అలాగా ! అయితే తీసుకో. కాఫీ హోటలు పెట్టి రోజూ రెండుపూటలు నువ్వుతిని మిగిలిన వాళ్ల కింత పెట్టు.' మంచి పేరు తెచ్చుకో." అంటూ ఆమె ఒక కాగితం ముక్క వాడి కిచ్చింది. వాడు దాన్ని అందుకున్నాడు.

"ఊం ! ఇక పో నువ్వు. మళ్లీ డబ్బు కావలసి నప్పుడే నాదగ్గరికి రా. ఈ లోపల రాకు. అంటే సాయం త్రమే. ఈ లోపల రాకూడదు."

వాడు లేచి చేతిలో కాగితంతో ఇవతరికి వచ్చాడు. నన్ను చూసి ఒక్క క్షణం ఆగి అంతలోనే చొక్కా చివరతో ముక్కు తుడుచుకుంటూ గుమ్మం దాటి బయటికి వెళ్లిపో యాడు. నేను స్పష్టంగా చూశాను. ఆ కాగితం ముక్కమీద పదివేల రూపాయలు అని వ్రాసివుంది.

ఆమె నన్ను చూడలేదు. ఇంతలో చూస్తుందన్న ఆశగానీ పట్టించుకుంటుందన్న నమ్మకం గానీ లేదు.

"ఊం ! నువ్వెంత అడిగావురా బుచ్చి" ?

బుచ్చి లేచి నిలబడి నుదుటి మీద పడుతున్న జుట్టును ఎగదోసుకుంటూ "లక్ష" అన్నాడు.

"ఏం చేస్తావు. లక్ష తీసుకుని ?"

"సినిమా తీస్తాను."

"వెరీగుడ్. బాగు పడతావు. తీసుకుపో."

వాడుకూడా లక్ష రూపాయల చీటీతో ఇవతలికి వచ్చాడు.

నేను 'ఉస్సుర'ని నిట్టూర్చి గుమ్మం ఇవతలికి వచ్చి రుమాలుతో విసురుకొంటూ నిలబడ్డాను. లోపలి నుంచి మాటలు వినవస్తూనే వున్నాయి.

"నీకెంత ?"

"అయిదువేలు"

"ఎందుకు ?"

ఒక్క క్షణం నిశ్శబ్దం...

"పెళ్లి చేసుకుంటాను."

ఆమె నవ్వు వినిపించింది కొద్ది క్షణాలు. తర్వాత "అలాగే. పెళ్లి చేసుకుని పిల్లాపాపలతో వర్ధిల్లు."

మాసిపోయిన పూలగౌను వేసుకున్న పిల్ల ఇవతలికివచ్చి నన్ను ఒక్కక్షణం చూసి తలతిప్పుకుని వెళ్లిపోయింది.

"నీకు ?"

"అయిదు రూపాయలు."

"పాపం ! అయిదు రూపాయలేనా ? ఎందుకే ?"

"బజ్జీలు కొనుక్కొంటాను."

"సరే తీసుకో... అయితే అన్నీ నువ్వే తినకు...జబ్బు చేస్తుంది."

"తమ్ముడికీ...అమ్మకూ పెడతాను..."

దిన మొలతో ఉన్న అయిదేళ్ల పిల్ల ఇవతలికి వచ్చిం

"నువ్వు? ఎంత అడిగావు నువ్వు?"

"పదహారు..."

"పదహారు వేలా? ఏంచేస్తావు?"

"ఇల్లు...మేడ కట్టుకుంటాను..."

"మంచిపనే...తీసుకుపో..."

అయిదుగురూ ఇవతలికి వచ్చారు. ఎదురుగా ని గన్నేరు చెట్టుక్రింద చేరి కాగిలాలు ఒకరిది మరొకరికి చూపి కుంటూ నిలబడ్డారు.

నేను తలతిప్పి పంచలో కూర్చున్న వ్యక్తివంక చూశాను అతడు కూర్చునే కళ్లు మూసుకుని కునికిపాట్లు పడుతున్నాడు లోపల ఆమె నెమ్మదిగా "అంతా యిచ్చేశాను... నాకేమీ మిగల లేదు..." అని గొణుక్కుంటున్నది.

నేను లోపలికి వెళ్లి ఆమె ఎదురుగా నిలబడ్డాను. హఠాత్తుగా తలయెత్తి చూసింది. ఆమె కళ్లకు లావుపాటి అద్దాలున్న పాత కళ్లజోడున్నది.

నేను చేతులు కట్టుకుని "నాకేమి ఇస్తావు ఉమా?" అని అడిగాను.

ఆమె అంతలో ఫక్కున నవ్వింది. కళ్లజోడు తీసి నేల మీద పడేసింది. నవ్వుతూనే నేల మీద కూలబడింది. కొద్ది క్షణాలసేపు అలా నవ్వుతూనే వుంది. అంతలోనే ఆ నవ్వు ఏడుపుగా మారింది. నేనలా చూస్తూవుండగానే అవతలివైపుకు తిరిగి వెక్కివెక్కి ఏడవటం ప్రారంభించింది.

నేను స్థాణువులా శిలా ప్రతిమలా నిలబడి పోయాను. ఆమె దగ్గరికి వెళ్లి ఓదార్చాలనీ, మెత్తని మాటలతో ఊరడిం

చాలనీ...ఏమీ తోచలేదు. నేను కూడా నేలమీద కూర్చుండి పోయాను.

*     *     *     *     *

ఉమ !

ఉమాదేవి !

మొదటిసారిగా దాదాపు పద్నాలుగేళ్ల పిల్లగా ఉన్నప్పుడు చూశాను. మనిషి కారునలుపు కాదుగానీ...నలుపు క్రిందే లెక్క. కోలముఖం...సన్నని ముక్కు...తెల్లని మబ్బుతునకల వలె స్వచ్ఛంగా నిర్మలంగా చెంపకు చేరడేసి ఉన్న కళ్ళు...ఆకళ్ల లో గొప్పవెలుగు... అమాయకత్వం...ప్రపంచాన్ని చూడాలనే ఆకాంక్ష...ఉత్సుకత... ఆమె తల్లి మాయింట్లో పనిచేస్తూ ఉండేది.

నేను సెలవులకు వచ్చిన మరునాడే చూశాను ఆపిల్లని. అప్పటికి నాకు పదహారు, పదిహేడేళ్ళు ఉంటాయేమో ! పట్నంలో హాస్టల్లో వుంటూ కాలేజీలో చదువుకుంటూ ఉండేదాన్ని...ఆనాడు హాయిగా ప్రశాంతంగా నిద్రపోయిలేచాను. ఒళ్ళు విరుచుకుని పక్క కిటికీలో నుంచి చూస్తే తెల్లని, మబ్బులేని ఆకాశం, తెల్లకాగితం ముక్కలాగా కనిపించింది. కిటికీ పక్కనే గులాబీ చెట్టు... గాలికి కదులుతున్నవి. ఆచెట్ల పక్కన నిలబడి ఒకే ఒక పువ్వు ఉన్న కొమ్మను ముళ్లు తగల కుండా వంచుతున్న ఆపిల్ల కనిపించింది.

నేను గాభరాగా "ఏయ్ ! ఎవరు నువ్వు? ఆపువ్వు కోస్తావెందుకు ? " అని అరిచాను.

ఆపిల్ల అదిరిపడి కొమ్మ వదిలి, ఒక్కసారి నావంక చూసి అంతలోనే పారిపోయింది.

నేను లేచి యింట్లోకి నడిచాను. అమ్మ పెరట్లో ఉన్నట్లుంది.

"అమ్మా ! అమ్మా ! " అని అరుస్తూ పెద్ద పెద్ద అంగలు వేస్తూ పెరట్లోకి వెళ్లాను.

అమ్మ బావి పళ్లెం మీద నిలబడి వుంది. "ఏం కొంప మునిగిందే...గావుకేకలు పెడుతున్నావు..." అన్నది. పక్కనే అంట్లు తోముతున్న రుక్కమ్మ నన్ను చూసి సంభ్రమంతో ఆనందంగా "ఎప్పుడొచ్చారు చిన్నమ్మ గారూ !" అన్నది.

"నిన్నరాత్రి దిగిందిలే..." అని అమ్మ మళ్ళీ నావైపు తిరిగి "ఎందుకే అంతలావున అరుస్తున్నావు?" అని అడిగింది.

"ఎవరో పిల్ల గులాబీ పూలు కోసుకు పోతున్నదమ్మా" అన్నాను నేను.

అంతలో గోడ పక్కన నిలబడివున్న ఆ పిల్లను చూశాను. వేలు చూపిస్తూ "అదుగో...ఆపిల్లే..." అన్నాను.

అమ్మ, రుక్కమ్మ ఒకసారి అటుచూశారు. ఆపిల్ల గోడపక్కన నేల చూపులు చూస్తు నిలబడివుంది.

అమ్మ అంతలోనే నవ్వి "భలే పూలదొంగను పట్టుకున్నావే..."అన్నది.

రుక్కమ్మ "మా అమ్మాయే చిన్నమ్మగారూ !"అన్నది.

అమ్మ నాదగ్గరికి వచ్చి నాభుజం పట్టుకుని "దాని పేరు ఉమ...ఉమాదేవి...అది పువ్వులు దొంగిలించదు.నీలాగే దానికీ గులాబీలంటే యిష్టం...రోజూ పూలను చూస్తూ ఉంటుంది. అంతే...పద" అన్నది యింట్లోకి తీసుకుని పోతూ. నేను పెరటి గుమ్మం దగ్గర ఆగి ఆపిల్ల వంక చూశాను. మాసిన పువ్వుల పరికిణీ...భుజం మీద కొద్దిగా చిరిగిన నల్లని జాకెట్టు...మెడలో ఒక నీలం పూసలదండ...

ఆపిల్ల కూడా అంతలోనే నావంక చూసి నవ్వేందుకు ప్రయత్నించింది. నేను తలతిప్పుకుని లోపలికి వెళ్లిపోయాను

ఆసాయంకాలం నాలుగు గంటల వేళకు మళ్లీ వచ్చింది.

వాకిట్లో నుంచి తల్లి వెనుక నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వొస్తూనే వరండాలో కూర్చునివున్న నన్ను చూసి నవ్వింది. నవ్వినప్పుడు ఆమె తెల్లని పళ్ళు తళతళ మెరిశాయి. తల నున్నగా దువ్వుకుని ఆ చిన్న జడ చివర ఎఱ్ఱ రిబ్బను ముక్క కట్టింది.

రుక్కమ్మ లోపలికి పక్క సందుగుండా వెళ్లిపోతూ వుంటే ఆమె నాదిరి నెమ్మదిగా నడిచి వచ్చి వరండా చివర నిలబడింది.

నేను నవ్వి చేతిలో పుస్తకం మూసి 'కూర్చో' అన్నాను చాప చూపించి.

బిడియపడుతూ చాపమీద కూర్చోవచ్చునో, కూడదో అని సందేహిస్తున్నదానిలాగా తటపటాయిస్తూ వుంటే

"నిన్నే కూర్చో" అన్నాను మళ్లీ.

తలవంచుకుని కూర్చుందే తప్ప ఏమీ మాట్లాడలేదు.

అమ్మ ఇంతలో లోపలినుంచి వచ్చింది. లోపల ఇంత సేపూ ఏం చేస్తున్నదోగాని ఆమె ముఖం నిండా చెమట పట్టి బొట్టు క్రిందకి జారుతున్నది. చీరకొంగుతో ముఖం తుడుచుకుంటూ "అమ్మాయ్! మీ నాన్నగారొచ్చే వేళయింది." అన్నది అనవసరంగా.

"అయితే నన్నేం చేయమంటావు ?" అన్నాను నేను.

"ఏం చెయ్యాలంటానా ? అలా కూర్చుని ఇంతసేపటి నుంచీ చదువుతున్నది చాలంటాను. ఇక లేచి స్నానం చేసి మంచి బట్టలు కట్టుకుని ముస్తాబై కూర్చోమంటాను. ఆయన వచ్చారంటే ఇక ఎవర్నీ నిలవనివ్వరు...పదపద" అంటూనే అమ్మ నాభుజం పట్టుకుని లేవదీసింది.

"ఏమిటమ్మా ? ఏమిటీ గొడవ ?" అంటూనేవున్నాను నేను. ఆమె వినిపించుకోకుండా "మా బంగారు తల్లివి కదూ!

వెళ్లి స్నానం చేసిరా...చూడు...ఈ ఎండకూ, గాలికీ చెమట పోసి ఎంత చీదరగా వుందో...హాయిగా స్నానం చేసిరా..." అన్నది నన్ను లోపలికి తీసుకుపోతూ.

నేను గత్యంతరం లేక అమ్మ వెంట వెడుతూ చాపమీద కూర్చుని వున్న ఆపిల్ల వంక చూశాను. అది ఎందుకో ముసి ముసిగా నవ్వుతూ కూర్చుని వుంది.

పెరట్లో బావి దగ్గర రుక్కమ్మ నీళ్ల తోడి పోస్తు న్నది.

"చిన్నమ్మగారూ ! ఆరొచ్చే యేళయింది. ఇంకా ఇట్టాగే వున్నారా ?" అన్నది నన్ను చూసి.

"ఎవరొస్తారు ?" అని అడిగాను కళ్లు పెద్దవిచేసి ఉత్కంఠతో.

"కూసేపాగండి. మీకే తెలుస్తది." అన్నదిరుక్కమ్మ నవ్వుతూనే. అంతలోనే సందులోనుంచి ఉమకూడా వచ్చింది. ఆమె కూడా బావి పళ్ళెం మీద కూర్చున్నది.

నేను పక్కనే వున్న స్నానాల గదిలో దూరి "ఏదో గొడవ జరగబోతున్నది..." అనుకున్నాను.

స్నానం ముగించి మధ్యగదిలోకి వచ్చేసరికి అక్కడ మంచం మీద నా దుస్తులు సిద్ధంగా వున్నాయి. ఎర్రఅంచు ఆకుపచ్చని పరికిణీ, తెల్లనిపూల నల్లజాకెట్టు, తెల్లనివోణీ... 'ఏమిటి చెప్మా ! ఇవాళ అమ్మ యింత హడావిడి చేస్తున్నది' అనుకుని ఆశ్చర్యంతో పౌడరుడబ్బా చేతిలోకి తీసుకున్నాను. అద్దం ముందు నిలబడితే కుడిప్రక్కనే కిటికీ...

తలతిప్పి చూద్దును కదా ! కిటికీ అవతల నిలబడి వుంది ఉమ. దీన్ని అడిగి ప్రయోజనం లేదు. బొత్తిగా మూగపిల్ల లావుంది. ఇంతవరకూ అసలు నోరెత్తి మాట్లాడ

నేలేదు.

ఒకపావు గంటలో ఎలాగైతేనేం ఈ హడావిడి అంతా ఎందుకో అర్థమైంది. అర్థం కాగానే 'ఛీ' అనుకున్నాను ముందు. తర్వాత నింపాదిగా మంచం పట్టెమీద కూర్చుని ఆలోచించాను. వీళ్లు అనుకున్న ప్రకారం జరిగిందంటే ఇక నన్ను చదువుకోనివ్వరు. బంగారం లాటి చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టించేస్తారు. ఇన్నాళ్ళూ, ఇన్నేళ్ళూ హాయిగా హాస్టల్‌లో ఇతర పిల్లలతో ఆడుతూ పాడుతూ గడిపాను. హాయిగా చదువుకున్నాను. ఇతర పిల్లలతో పోటీపడి మార్కులు తెచ్చుకుని "వసుంధర సూపర్బ్" అని టీచర్లచేతా, ఇతరులచేతా అనిపించుకున్నాను. బాగా చదివి అన్ని క్లాసులూ పాసై మంచి ఉద్యోగం సంపాదించి నలుగురిలో గొప్పగా జీవించాలనుకొన్నాను. కాలేజీ లెక్చరర్ కావాలని ఎంతో అనుకునే దాన్ని. నాతోటి పిల్లలు చాలమంది డాక్టర్లు కావాలని అనుకునేవారు. కొందరు గవర్నమెంటు ఉద్యోగాలు దొరికితే చాలని అనుకునేవారు. ఒకపిల్ల — జయంతి మాత్రం "నేను డిగ్రీ తెచ్చుకుని పోలీసు డిపార్టుమెంటులో చేరుతాను." అనేది.

"ఎక్కడైనా ఆడవాళ్ళు పోలీసు ఉద్యోగాలు చేస్తారా?" అంటే, "ఏమో, ఎవరు చూడొచ్చారు? మీరనుకునే ఉద్యోగాలు మాత్రం ఇంతకు ముందు ఆడవాళ్ళు చేశారా? ముందుముందు ఆడపోలీసులు, ఆడయస్సయ్‌లు ఉండరని ఎందుకనుకోవాలి? చూస్తూ వుండండి. కొద్ది రోజుల్లో ఆడవాళ్ళు ఇంజనీర్లవుతారు. పోలీసులవుతారు. అన్నీ చేస్తారు." అనేది.

ఇంతమంది ఇన్నివిధాల అనుకున్నా నాకు మాత్రం చదువు పూర్తిఅయిన తర్వాత కాలేజీ లెక్చరర్‌గా స్థిరపడాలని కోరికగా ఉండేది.

ఇప్పుడు...ఇప్పుడేం జరగబోతున్నది ? పెద్దగా ఛీత్కారం చేసి "అమ్మా" అని ఇంటికప్పు ఎగిరిపోయేట్టు అరుచుకుంటూ వంట యింట్లోకి వెళ్లాను. గుమ్మం ఎదురుగానే బావి...బావిపళ్లెం మీద గిన్నెలుతోముతున్న రుక్కమ్మ...ఆ పక్కనే నిలబడిన ఉమ...నా ఎదురుగానే ఉన్నారు.

"ఏమిటమ్మా ?" అన్నది నెమ్మదిగా మా అమ్మ.

ఏంచెప్పాలో ముందు తోచలేదు. పైగా లోపల కోపం...కసి...

ఉన్నట్లుండి "నాకొద్దు" అని పెద్దగా అరిచాను. అంతలోనే నా కళ్లలో నీళ్లు ఉబికి వచ్చాయి.

మా అమ్మ మళ్లీ నెమ్మదిగా "ఏమిటి వొద్దంటావు ?" అని నిమ్మకు నీరెత్తినట్టు అడిగింది. రుక్కమ్మ నవ్వుతూ చూస్తున్నది. ఉమకూడా తెల్లని పళ్లు బయటపెట్టి అకారణంగా నవ్వుతున్నది.

నాకు అరికాలు మంట నెత్తికెక్కింది. కసిగా కాలితో తలుపును తన్ని సమాధానం చెప్పలేక నిలబడిపోయాను.

మళ్లీ అమ్మ "ఏమిటీ వొద్దంటున్నావు...ఈ జంతిక లేనా ? పోన్లే...వద్దులే...నీకేం కావాలంటే అదే పెడతాను. తిందువుగాని..." అన్నది నావంక చూడకుండానే.

నేను గోడకానుకుని కూలబడి పెద్దగా "నేను ఇంకా చదువుకుంటాను...చదువు మానుకోను..." అని అరిచాను.

అమ్మ ఇంతకు ముందులాగే నింపాదిగా "చదువుకో... దానికేం ?" అన్నది.

నేను గొంతు తగ్గించకుండా "నేను ఎం. ఏ. పాసయ్యే దాకా చదువుతూనే వుంటాను. ఆ తర్వాత లెక్చరర్ నవుతాను..." అన్నాను.

"అలాగే" అన్నది అమ్మ.

నాకు కసిపుట్టి "మరి...ఈన్యూసెన్సంతా ఏమిటి ?" అని అరిచాను.

మా అమ్మ అది విని అప్పుడు నావంక ఒక్క క్షణం చూసింది. తర్వాత ఏమనుకున్నదో ఏమో ఏమీ మాట్లాడ కుండా తలతిప్పుకుని తన పనిలో లీనమైంది.

నేను విసుగ్గా మళ్ళీ యివతలిగదిలోకి వచ్చి కిటికీ దగ్గర నిలబడ్డాను. అంతలో కిటికీ అవతల అలికిడి అయింది. ఉమ వచ్చి నా ఎదురుగా నిలబడింది. ఆ పిల్ల యిప్పుడు నవ్వడం లేదు. పెద్ద పెద్ద కళ్ళతో ఆశ్చర్యంగా నావంక కన్నార్పకుండా చూస్తున్నది. నేను అక్కడనుంచి కదిలిపోయి మరోవైపు నిలబడదామని అనుకున్నాను, కాని ఆపిల్ల కళ్ళు నన్ను కట్టేశాయి. అలాగే ఆ కళ్ళ వంకనే చూస్తూ కదల కుండా నిలబడిపోయాను.

ఒక్క నిముషం తర్వాత ఉమ కిటికీకి బాగా దగ్గరగా వచ్చి కిటికీ కటకటాలు పట్టుకుని నిలబడి మొదటి సారిగా నోరు విప్పి 'అమ్మాయిగారూ !' అని పిలిచింది.

నేను తలఎత్తి చూశాను. ఉమ కంఠ స్వరం అదే మొదటిసారి వినడం...నేను చదువుకున్న స్కూల్లో సంగీతం టీచరుగొంతు తియ్యగా, చల్లగా వుండేది. ఆమె ఎంతో గొప్పగా పాడుతుంది. రేడియోలో కూడా అప్పుడప్పుడు పాడుతూ వుంటుంది. కొన్ని దూరపు వూళ్ళకు కూడావెళ్ళి కచేరీలు చేస్తూవుంటుంది. ఉమ కంఠం వినగానే నాకు ఉన్నట్టుండి ఆమె గుర్తుకు వచ్చింది. ఆమె పేరు విజయ వాణి. మనిషి ఏమీ బాగుండదు. నల్లగా లావుగా ఉంటుంది అందుకే ఆమెకు పెళ్ళికాలేదని చెప్పుకుంటూ వుండేవారు అందరూ.

ఉమ మళ్లీ "అమ్మాయిగారూ ! మీరు ఎన్నోక్లాసు" అని అడిగింది.

నేను చెప్పాను.

ఉమ మళ్లీ "నేనిన్నాళ్లూ మా అత్తయ్యగారి యింటి దగ్గర ఉండేదాన్ని...థర్డ్‌ఫారంలో ఫస్ట్‌మార్కులన్నీ నావే. మాఅత్తయ్య ఎంతో మంచిది. మానాన్నలాగా కాదు, నన్నెంతో ప్రేమగా చూసుకునేది. చాల రోజులక్రితం ఇక్కడికొచ్చినపుడు 'ఈపిల్ల నీదగ్గరే వుంటే దీన్ని కూడా వొదిన లాగే పని మనిషిగా తయారుచేస్తావు. నేను తీసుకుపోయి నాదగ్గరుంచుకుని చదివించి గొప్పదాన్ని చేస్తాను. " అని పోట్లాడి మరీ తీసుకు పోయింది. అక్కడ వాళ్ల ఇల్లు కూడా చిన్నదైనా ఎంతో బాగుండేది. మామయ్య మంచివాడు. ఫ్యాక్టరీలో పనిచేస్తూ వుండేవాడు. వాళ్లకూ పిల్లల్లేరు..." అన్నది.

నేను "అయితే మళ్లీ వచ్చేశావేం? సెలవులకొచ్చావా?" అని అడిగాను.

ఉమ కళ్లు నీళ్లతో తళతళలాడాయి. అంతలో తల వంచుకుని దిగులుగా "సెలవులకు రావడం కాదు. ఏకంగానే వచ్చేశాను. చదువు మానేసి వచ్చాను. నాలుగు నెలలకిందట" అన్నది.

"ఏం? ఏంజరిగింది ?'" అన్నాను నేను ఉత్కంఠతో.

"మా అత్తయ్యకు పెద్ద జబ్బు చేసింది. ఆస్పత్రిలో చేర్పించి మందులిప్పించాడు మామయ్య. కాని ఆమె బతకలేదు. ఆస్పత్రిలో చేర్పించిన పదిరోజుల్లో చచ్చిపోయింది."

"పాపం !" అన్నాను జాలిగా నేను.

"ఆమె పోగానే మాఅమ్మా నాన్న వొచ్చారక్కడికి. అంతా అయిపోగానే నన్ను గురించి తర్కించుకున్నారు. 'చదువూ వొద్దు. ఏమీవొద్దు. ఇదిక్కడ ఇంకెందుకు ? తీసుకు

పోతాం: అక్కడే పడి వుంటుంది'. అన్నాడు నాన్న. మామయ్య మాత్రం 'దాని చదువు మాన్పించడం దేనికి? ఇక్కడేవుండి చదువుకుటుంది. అని అననే అన్నాడు. దానికి మా నాన్న ఒప్పుకోలేదు. మొండిపట్టు పట్టి నన్ను తీసుకు వచ్చేశాడు. అప్పటినుంచీ చదువూ లేదు పాడూ లేదు . . .

"ఇక్కడే ఇట్టా పడివున్నాను."

నేను సానుభూతితో ఉమవంక చూస్తూ ఉండిపోయాను.

అంతలో ఆ పిల్ల చిటికెన వ్రేలితో కనుతుదలు తుడుచుకుంటూ నవ్వుతూ "మీకు చదువుకోవాలని బాగా ఉన్నట్టుందే . . ." అన్నది.

"అవును...బాగా చదువుకుని కాలేజీలో లెక్చరర్‌ను కావాలి".

ఉమ తలతిప్పి నెమ్మదిగా "నాకు చదువుకోవాలని వుంది. చదువుతోపాటుగా సంగీతం నేర్చుకోవాలని వుంది. కాని, ఏం లాభం..." అని నిట్టూర్చింది.

నా మనస్సు వికలమైంది. అంతలోనే ముందుగదిలో కలకలం...

"రండి...రండి" అంటూ మా నాన్నగారు ఎవరినో లోపలికి ఆహ్వానిస్తున్నారు.

ఉమాదేవి నాతో "మళ్లీ వస్తాను...మీరిక్కడే వుండండి" అని తూనీగలా పరిగెత్తి ఇంటి ముందుకు పోయింది.

నేనలాగే అసహనంగా కాస్సేపు నిలబడి ఆ తర్వాత మంచం పట్టెమీద కూలబడ్డాను.

అంతలోనే ఏవేవో ఆలోచనలు...ఈవ్యవహారం ఇంత దూరం రానేవచ్చింది కాబట్టి మనం జాగ్రత్త పడకపోతే లాభం లేదు. సాలెగూట్లో ఈగలాగ చిక్కుకుపోవడం తప్పదు.

మాఅమ్మా నాన్నలకు మాఅన్నయ్యా, నేనూ ఇద్దరమే సంతానం. మాఅన్నయ్య ఇంజనీరింగ్ చదివి మంచి కల్ప వృక్షం లాటి ఉద్యోగంలో ఎక్కడో దూరంలో ఉండిపోయాడు. సంవత్సరానికొక సారి ఇటువైపు రావాలన్నా వాడికి బోలేడంత ఖర్చు. ఇకమిగిలింది నేను. ఇటీవల సెలవులకు ఇంటికి వచ్చినప్పుడు చుట్టుపక్కల అమ్మలక్కల మాటలూ, మా అమ్మా నాన్నల సంభాషణలూ వింటూనే వచ్చాను.

"ఎదిగిన పిల్ల గుండెలమీద కుంపటి..." "ఆడ పిల్లలు చదివి ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్లేలాలా?" "దీని ఈడువాళ్లందరికీ పెళ్లిళ్లు కావడం లేదూ?" వగైరా నాన్సెన్స్ ఎంతో విన్నాను. అందువల్ల ఇలాంటి ప్రమాదం ఏదో ఉందని తెలుసుగానీ, అది ఇంత తొందరలోనే ముంచు కొస్తుందనుకోలేదు. కనీసం నాతో ఒక్క మాటయినా చెప్పకుండా అమ్మా నాన్నా కలిసి యింత ఘోరం చేస్తారను కోలేదు. 'ఇప్పుడిక ఈ ప్రమాదం తప్పించుకొనే ఉపాయాలు ఆలోచించాలి.' అనుకుంటున్నాను.

అంతలో కిటికీ దగ్గర ఉమ కనిపించింది. నేను మంచం మీది నుంచి లేచి కిటికీ దగ్గర చేరాను.

ఉమ హడావిడిగా "వొచ్చారు...అందరూవొచ్చారు... ముందుగదిలో కూర్చున్నారు. పెళ్లికొడుకు తండ్రికి..." అంటూవుంటే నేను ఆపి, "ఛ! అప్పుడే పెళ్లికొడుకంటావేం" అన్నాను కొంచెం పెద్దగానే.

ఉమ తప్పు తెలుసుకుని నవ్వి "పొరపాటే...అబ్బాయి తండ్రికి ముప్పయి ఎకరాల మాగాణిపొలం ఉందట...అందులో బంగారం పండుతుందట...అబ్బాయి ఎక్కువ చదువుకోలేదట. స్కూల్‌ఫైనల్‌తో ఆపేశాట్ట...అంటే పాసయ్యాడో లేదో తెలియదు. ఒక్కడే కొడుకట...కూతుళ్ళూ, ఇతర గొడవ

లేవీ లేవట..." అని గుక్కతిప్పుకోకుండా చెప్పింది.

"ఎట్లా వున్నాడు ?" అని అడిగేశాను నేను.

"ప్చ్ !" అన్నది ఉమ. "అచ్చం పొలం దున్నుకునే వాడిలాగే వున్నాడు. బండరాయిలాగా రుబ్బురోల్లాగా పొట్టిగా గుండ్రంగా ఉన్నాడు. అబ్బే..." అన్నది నవ్వుతూనే.

నాగుండెలు దడదడలాడుతున్నాయి. ఈ సంబంధం సెటిలయిందంటే మనపని ఔట్. చదువుకు తిలోదకాలు... అనుకున్నదంతా తల్లక్రిందులైపోతుంది. ఎలా తప్పించుకోవాలి ఈ ఉపద్రవం ? ఎవరు సాయం చేస్తారు ? ఎవరు సలహా ఇవ్వగలరు ?

ఉమ నా ఆలోచనలు పసికట్టినట్టు నెమ్మదిగా "అమ్మాయ్ గారూ ! సినిమాల్లోలాగా మిమ్మల్ని పిలవగానే కుంటుకుంటూ వెళ్ళండి. కూర్చోగానే మెల్లకన్ను పెట్టండి. ఇలాగా..." అంటూ నటించి చూపించింది.

నాకు నవ్వువచ్చింది.

ఇవ్వేమీ లాభం లేదు. ఏమీ గొడవపెట్టకుండా ఈ తంతు అంతా మామూలుగానే కానిచ్చేద్దాం. ఈ ప్రదర్శన ముగియగానే, వాళ్ళు అటుపోగానే అల్లరి ప్రారంభిస్తే సరి...'ఈపెళ్ళి చేస్తే నేను మీకు దక్కను. నూతిలో పడి చస్తాను. నాకుకాదు నాశవానికే మీరు పెళ్ళి చేసేది...నా మాట వినేవరకూ పచ్చిమంచి నీళ్ళు కూడా ముట్టుకోను...' అని యాగీ చేసి పారేద్దాం. ఎలాగూ చిన్నప్పటి నుంచీ మొండిదాన్నని పేరు తెచ్చుకున్నాను. ఆపేరును సార్ధకం చేసుకునే శుభఘడియ రానే వచ్చింది. ఇలా సాగుతున్నాయి నా ఆలోచనలు...

ఇంతసేపూ ఉమ కిటికీ అవతల నిలబడి నావంకనే కళ్ళార్పకుండా చూస్తున్నది.

అంతలో అమ్మ వచ్చింది. వచ్చీరావడంతోనే గోము "రా వసూ...ఒక్కసారి...వచ్చిముందు మొహం కడుక్కో... అని పిలిచింది మృదువైన కంఠంతో.

నేను ఎంతో బుద్ధిమంతురాలివలె లేచి పెరట్లోకివెళ్లి మొహం కడుక్కుని అమ్మ వెంట ముందు హాల్లోకి వెళ్లాను.

అక్కడ కాబోయే అత్తగారు ముందు కనిపించింది. చాపమీద చింతపండు బస్తా పడేసినట్టు కూర్చుని వుంది మహాతల్లి. మెడ కనిపించకుండా అంతా బంగారమే. నల్లటి శరీరచ్ఛాయకు అద్భుతంగా తగినట్టు ఆకుపచ్చని పట్టుచీరె కట్టుకుని వుంది. నల్లరంగు రవికె తొడుక్కుని ఉంది. ఎదురుగా కుర్చీలమీద మిగిలిన యిద్దరూ కూర్చుని ఉన్నారు. జరీ కండువా వేసుకుని తెల్లని పంచె లాల్చీలతో వ్రేళ్లకున్న రాళ్ల ఉంగరాలు కనిపించేట్టుగా పోజు పెట్టి కూర్చునివున్న వ్యక్తి పిల్లవాడి తండ్రి అయివుంటాడు. వీళ్లిద్దరినీ చూసి ఇక అబ్బాయిని చూడనక్కరలేదనిపించినప్పటికీ ఆ కొద్ది వ్యవధి లోనే ఓరగంట అటుకూడా ఒకచూపు విసిరాను. ఉమ చెప్పింది నిజమే...

అంతలో ఉలిక్కిపడ్డాను. "రా అమ్మా ! ఇటు వొచ్చి కూర్చో" అన్న కంఠం పిడుగులా వినిపించింది. కాబోయే వియ్యపురాలి గొంతువిని అమ్మ కూడా ఉలిక్కిపడి నట్టుంది. నాభుజం పట్టుకుని నెమ్మదిగా 'రా' అంటూ తీసుకు వెళ్లి చాపమీద కూర్చోబెట్టింది.

అక్కడనుంచీ వాతావరణం మారింది. ఏవేవో ప్రశ్నలు సమాధానాలు...కొంచెం కొంచెం నవ్వులు...టిఫిన్లూ...కాఫీలు చిన్న చిన్న ఛలోక్తులు...పెళ్లికొడుకు కుర్చీనిండా విగ్రహం లాగా కాలుమీద కాలువేసుకుని కూర్చుని జంతికలు కరకరమని చప్పుడు చేస్తూ నవుల్తున్నాడు.

మానాన్న కుదురుగా కూర్చోకుండా అటూ యిటూ తిరుగుతూ అనవసరంగా హడావిడి పడిపోతున్నాడు.

తర్వాత ఒక పావుగంటలో ఈ తతంగం అంతా ముగిసింది.

పెళ్ళికొడుకు తండ్రి అటూయిటూ ఒకసారి చూసి 'ఇక వెళ్లొస్తాం,' అనడంతో అందరిలో కదలిక ప్రారంభమైంది. పెళ్ళికొడుకు పళ్ళెంలో చివర మిగిలిన జంతిక ముక్కను నోట్లో కుక్కుమని లేచాడు. ఇలా పెళ్ళి చూపుల పేరుతో ఇప్పటికి ఎన్నిచోట్లకు వెళ్ళి టిఫిన్లు మెక్కాడో అనిపించి నేను తలవంచి నెమ్మదిగా నవ్వుకున్నాను. ఎవరో ముందుకు వచ్చి చేయి అందించి లేవదీయగా వియ్యపురాలు కూడా లేచి ఆపసోపాలు పడుతూ "వెళ్లొస్తాం మరి" అన్నది. మరికొన్ని నిమిషాలలో హాలులో వున్న పటాలమంతా పంచలోకి వెళ్ళారు. ఆతర్వాత పంచలో "ఉంటావమండీ" అని మానాన్న, "వెళ్లొస్తామండీ' అని వారూ వీడ్కోళ్ళు చెప్పుకున్న తర్వాత వాకిట్లోవున్న బండి బరువుగా సాగిపోయింది.

నేను లేచేసరికి ఎప్పుడు వచ్చిందో ఏమో ఉమ హాల్లో గుమ్మం పక్కన నిలబడివుండి కనిపించింది. మా అమ్మ లోపలికి రాగానే నేను ఉబికి వచ్చే కళ్ళనీళ్ళు ఆపుకుంటూ 'ఏమిటమ్మా ఇదంతా ?" అన్నాను.

ఆమె నాదగ్గరకి వచ్చి "ఏమి లేదు...అంతా మామూలే. ఎప్పటికైనా తప్పదుగా...ఏదోమంచి సంబంధం...బాగావున్న వాళ్ళు...అంతా సవ్యంగా జరిగిపోతే మంచిదేగా..."అన్నది.

నాకు వొళ్ళు మండుకొచ్చింది. "అన్నయ్యకు ఇట్లాగే చదువు ఆపుచేసి మధ్యలో పెళ్ళి చేశారా ?" అని అడిగాను.

"అన్నయ్యా నువ్వూ ఒకటేనా ? వాడు మొగవాడు, పెళ్ళి ఖాయం అయిన తర్వాత నాదిన చదువుమానేసింది.

అది గుర్తుంచుకో..."

నేను ఉక్రోషంతో నిస్సహాయంగానిలబడిపోయాను. అంతలో మానాన్న కండువాతో ముఖం తుడుచుకుంటూ లోపలికి వచ్చి కుర్చీలో కూలబడి "కాసిని మంచి నీళ్ళివ్వు" అన్నాడు అమ్మ నుద్దేశించి.

అమ్మ రుసరుసలాడుతూ "మీ ముద్దుల కూతురు ఏమంటున్నదో వినండి..." అన్నది.

ఆయన ఆశ్చర్యంగా నావంక చూసి "ఏమంటున్నది?" అని అడిగాడు.

"దానికి పెళ్ళి వద్దుట...చదువుకుని పెళ్ళిమానేసి ఉద్యోగాలు చేస్తుందిట. ఊళ్ళేలుతుందిట..." అంటూ అమ్మ లోపలికి వెళ్ళింది.

నాన్న నావంక చూసి "ఏమిటి సంగతి ?" అని అడిగాడు

"నాకు చదువు మానేయడం ఇష్టంలేదు" అన్నాను.

అంతలో గుమ్మంలో నిలబడిన ఉమ ఆకస్మాత్తుగా "అవునండీ అయ్యగారూ ! పాపం ! చదువు మాన్పించకండి...' అన్నది.

నేను ఆపిల్ల కంఠస్వరం విని హఠాత్తుగా అటు చూశాను. అదే సమయంలో నాన్నగారు కూడా అటు చూడ టంతో బాగా బిడియ పడిపోయి గోడను ఆనుకొని నిలబడి పోయింది ఉమ.

నాన్నగారు అమ్మ తెచ్చియిచ్చిన గ్లాసెడునీళ్ళూ గటగట తాగి గ్లాసు మళ్ళీ ఆమెకే అందించి ఇదంత పెద్ద విషయం కాన ట్టూ, చాలా అల్ప సమస్య అయినట్టూ ముఖం పెట్టి అమ్మ నుద్దేశించి "బండివెంట వీధి చివరివరకూ వెళ్ళొచ్చాను. పిల్ల వాళ్ళకు నచ్చినట్టేవుంది. మిగిలిన విషయాలు మాట్లాడు కునేందుకు రేపు నన్ను వాళ్ళ యింటికి రమ్మన్నారు." అన్నాడు.

నాగుండెల్లో రాయి పడ్డట్టయ్యింది. త్వరత్వరగా బయటకి వచ్చి పంచలో చివరగా చాప మీద కూర్చున్నాను. మరుక్షణంలో ఉమకూడా వచ్చి పంచ చివర స్తంభానికానుకొని కూర్చున్నది.

ఆపిల్ల ఉన్నట్లుండి నిట్టూర్చి "ఆనాడు, మానాన్న బలవంతంగా నన్ను చదువు మానిపించి తీసుకు వొచ్చిననాడు ఎంతగానో బాధ పడ్డాను. ఏడ్చానుకూడా. పైగా,మామామయ్య దేవుడిలాంటి వాడు, ఎంతచెపుతున్నా మానాన్న వినిపించు కోలేదు. మా అమ్మకు కూడా నేను చదువు మానేసి రావడం ఇష్టం లేదు. ఎంతో దూరం చెప్పి చూసింది. "మనమెట్లాగూ దానికి చదువు చెప్పించలేలేము. ఆయన అంతగా చెబుతున్నప్పుడు అది అంతగా చదువుకోవాలని పోరు పెడుతున్నప్పుడు మనకేమిటి కష్టం.' అని బతిమా లింది. కాని మానాయన ఒప్పుకోలేదు..."అన్నది.

ఆపిల్లకు చదువుపట్ల వున్న మక్కువ తెలిసి నేను ఆశ్చర్యపోయాను. అంతలో నా ప్రస్తుత పరిస్థితి గుర్తుకు వచ్చింది.

తలవూపుతూ "సరే కానియ్" అనుకున్నాను.

ఉమ "మీకేం ఫరవాలేదు." అని నాదగ్గరగా జరిగి, నెమ్మదిగా "అప్పుడే ఏమయింది ? వాళ్ళు బాగావున్నవాళ్ళ కదా ! 'సంబంధం నచ్చిందికదా' అని ఊరికే చేసుకుంటారా? చెప్తున్నారుగా అయ్యగారు. "రేపు వస్తే మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం..." అన్నార్ట వారు. ఆ మిగిలిన విష యాలు అంటే ఏమిటి ? కట్నం, కానుకలు వగైరాలు... అవి పెద్ద బ్రేకులు...మీరేమీ కంగారు పడకండి...మీరను కున్నట్టు అంతా సవ్యంగా జరిగిపోతుంది." అన్నది.

ఆపిల్ల తెలివి తేటలకూ, మాటల ధోరణీ, పురుకు

దనానికీ, నేను నివ్వెరపోయాను. మొదట్లో ఆపిల్లను చూసి ఇంత తెలివైందనీ, మాటకారి అనీ ఎవరూ అనుకోరు.

అదే సమయానికి ముందు హాల్లో మా అమ్మ కూడా నాన్నతో "మీరేమీ కంగారు పడకండి...అంతా సవ్యంగా జరిగి పోతుంది." అంటున్నది.

'ఎవరి మాట ఫలిస్తుందో చూడాలి. అంతవరకూ వేచి ఉండక తప్పదు.' అనుకుంటూ ఉమ కళ్లల్లోకి చూశాను. ఆ పెద్ద పెద్ద కళ్లు నవ్వుతున్నాయి.

మరునాడు సాయంకాలం వరకూ ఉమ మాయింట్లోనే నాదగ్గరే వుంది. ఇద్దరమూ అనేక విషయాలు మాట్లాడు కున్నాం. నేను చదువుకుంటున్న ఊళ్లోనే ఉమకూడా హైస్కూల్లో చదువుకుంటూ ఉండేదని తెలుసుకుని ఎంతో ఆనందించాను. నాసమస్య అదృష్టవశాత్తూ నా పక్షాన తేలి నేను వొడ్డున పడితే, ఉమ చదువుగురించి వాళ్ల నాన్నతో పోట్లాడి ఆపిల్లను కూడా అక్కడి నుంచి కదిలించి చదువులో పడెయ్యాలని అనుకున్నాను. నేను వయస్సులోనూ, చదువు లోనూ ఉమ కంటే పెద్దదాన్నయినప్పటికీ ఉమ దగ్గర ఉన్న వెర్సటాలిటీ, ప్రతిభ నాదగ్గర లేవని అనిపించింది. ఆరోజు ఉదయం పదిగంటలకు ఇంటిదగ్గర నాలుగు మెతుకులు తిని వచ్చి నాతోనే ఉండిపోయింది. చిత్రవిచిత్రమైన లెక్కలు చెప్పింది. రకరకాలైన పొడుపు కథలువేసింది. సినిమాలను గురించి మాట్లాడింది. ప్రసిద్ధ గాయనీ, గాయకులను గురించి సంగీతాన్ని గురించీ నాకు తెలియని విషయాలెన్నో చెప్పింది. చివరకొక పాట పాడి వినిపించింది. ఆ కంఠ మాధుర్యానికి ముగ్ధురాలినై "సంగీతం నేర్చుకున్నావా ?,' అని అడిగితే, తల అడ్డంగా ఊపి " అబ్బే ఎక్కడా నేర్చుకో లేదు. మా అత్తయ్య నేర్పింది. అంతా అత్తయ్య, మామయ్య

చెప్పిందేనాకు. ప్రాణంలాగా చూసుకునేవాళ్ళు. ఆమె పోయింది. ఇదుగో నాబతుకిలాగయిపోయింది'' అన్నది అంతలోనే కళ్లనీళ్ళు పెట్టుకుని.

కొద్ది నిముషాలలోనే ముందుగదిలో ఏవో మాటలు వినిపిస్తే ఉమ ఒకవైపూ నేనొకవైపు చెంగున లేచి హాడావిడిగా అక్కడికి చేరుకున్నాము.

మా అమ్మ ఒకవైపు గోడకానుకుని నిలబడివుంది. మా నాన్న కుర్చీలో కూర్చుని ముక్కలు ముక్కలుగా తాను చెప్పదలుచుకున్న విషయాన్ని చెబుతున్నారు. ఆయన ఎప్పుడూ అంతే. ఏదైనా ముఖ్య విషయం మాట్లాడ వలసి వస్తే మాటల కోసం తడుముకుంటూ వుంటాడు.

''అసలేం జరిగిందంటే'' నేను వెళ్లానా ? నన్ను కూర్చో మన్నారు. వాళ్ళు అప్పటికే ఏదో మాట్లాడుకుంటున్నారు. నన్నుకూర్చో బెట్టి లోపలికి వెళ్ళిపోయారు. లోపలికిపోయి ఇంకా మాట్లాడుకుంటునే వున్నారు. పావు గంట అయింది. అరగంట అయింది. నాకేమీ తోచక ఈ లోపలబల్లమీదున్న పేపరు చదువుతూ కూర్చున్నాను ''అన్నట్టు మనపక్క ఊళ్లో ఇళ్ళు తగలబడ్డాయే పోయిన వారం. ఆవిషయం పేపర్లో వేశారు''. అంటూ ఆగాడు. ''ఇళ్ళు తగలబడటం సంగతి సరే '' ఆదెవరడిగారు మిమ్మల్ని ? అసలు విషయం చెప్పండి '' అన్నది అమ్మ విసుగుతో ''వొస్తున్నా, వొస్తున్నా, మంచినీళ్ళు పూర్తిగా తాగనీ ''అంటూ మానాన్న చెంబులో మిగిలిన నీళ్లు కాసినీ గటగట తాగి మూతితుడుచుకుని మళ్లీ మొదలు పెట్టాడు.

''ఆతర్వాత చాలాసేపటికి వచ్చారు వాళ్లే రాకుండా చుట్టు పక్కల యిళ్లవాళ్ళు కూడా ఉన్నారు. చాల మంది అంటే మొత్తం పదిమంది దాకా ఆడవాళ్లు మొగవాళ్లు

వున్నారు. అందరూ వొచ్చి గొడవగొడవగా మాట్లాడుకోడం మొదలు పెట్టారు. చివరకు రొద తగ్గించి ఆయనే —పిల్లవాడి తండ్రి — మధ్య మధ్యలో ఆయనకు వత్తాసు యిస్తూ పిల్లవాడి తల్లి—మాట్లాడారు'' ''ఏమి మాట్లాడారో త్వరగా తేల్చండీ '' అని అమ్మ అసహనంగా అన్నది. ''నేమా అదే అన్నాను విషయం ఏమిటో త్వరగా తేల్చండీ అని. అప్పుడు ఇద్దరూ కలిసి తేల్చి చెప్పారు. వాళ్లకు పదిహేను వేలు కట్నం కావాలిట. ఆడపడుచులు లేరుకాబట్టి అగొడవ ఏమీ లేదట. అత్తగారికి — ఒక్కతే కాబట్టి ఘనంగా లాంఛనాలు చదివించాలిట, అబ్బాయికి వెండి కంచం, వెండిచెంబు, వెండి రేడియో... కాదు కాదు మామూలు రేడియో — రేడియో ఇంట్లో ఒకటుందిట కాని అబ్బాయి స్వంతానికి వేరే కావాలిట. ఇంకా ఏం కావాలన్నా రబ్బా ! ఆ ! ఒక నీలం రాయి ఉంగరం... ఇవన్నీ, 'పిల్ల ఎలాగూ మీదే కాబట్టి నగా న్ట్రా మీ యిష్టం' అన్నారు. కాని పిల్ల వొంటిమీద నగలు వాళ్ల అంతస్తుకు తగ్గట్టు మాత్రం ఉండాలిట...ఇంతే... ఇలాగే చెప్పారు. ఆ ! ఆఖరులో పెళ్లిమాత్రం కాస్త ఘనంగా వాళ్లకు తగినట్టు కనీసం మూడురోజులైనా అన్ని ముచ్చట్లతో జరగాలన్నారు. పాపం ! వాళ్లకున్నది ఒక్కడే అబ్బాయి కదా! ఇక వాళ్ల ముచ్చటలెప్పుడు తీరేది ?'' అంటూ ముగించాడు నాన్న.

అంతసేపూ ఊపిరి బిగపట్టుకుని వింటూ నిలబడిన నాకు గుండెలమీదనుంచి పెద్ద కొండను దింపినట్టయింది ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయినాను. మితిమీరిన ఆనందం వల్ల కళ్లలో నీటిపొరలు నిలిచాయి.

ఉమ మరో వైపునుంచి వరండాలోకి వచ్చింది. ఆపిల్ల నవ్వుతున్నది. నవ్వుతూనే నెమ్మదిగా 'నేనుచెప్ప లేదూ ? అన్నది.

'అవును, ప్రస్తుతానికి గండం గడిచింది ' అనుకున్నాను. ఇద్దరం చాపమీద బుద్ధిమంతుల వలె కూర్చున్నాము. మాఅమ్మ రుసరుసలాడుతూ ఇవతలికి వచ్చింది. ఆమెకు ఈ సంబంధం కుదరని కారణంగా కసిగా ఉంది. అందరి మీద మండిపడటం ప్రారంభించింది. మాఇద్దర్నీ చూసి ' ఎందుకే అలా కూర్చున్నారు ? పనీ పాటూ లేదా ?' అన్నది.

నేను నెమ్మదిగా ' ఏంచెయ్యమంటావో చెప్పు ' అని అడిగాను. 'నేను చెప్పాలా ? ' అంటూ పెద్దగా అరిచింది మా అమ్మ, " ఏంచెయ్యాలో నేను చెప్పాలా ? ఇంటెడు చాకిరీ చేసుకోలేక సతమతమవుతుంటే కనిపించడం లేదూ ? ఒక్కదాన్నీ ఎలా చస్తానని ? ఎంతవరకని చావను ? నాకూ ఓపిక తగ్గిపోతున్నది. ఇదుగో ఇప్పుడే చెబుతున్నాను. ఇట్లా పుస్తకాలూ, చెత్తా చెదారమూ ముందేసుకు కూర్చుంటే ఇక కుదరదు. ఏళ్లొచ్చాయి నెత్తిమీదికి, కాస్త కష్టం సుఖం తెలియొద్దూ ? 'అయ్యో అమ్మ ఒక్కతే రెక్కలు ముక్కలు చేసుకొంటున్నదే.. కాస్త సాయంచేద్దాం' అన్నధ్యాసే లేదాయె. ఆడపుటక పుట్టిన తర్వాత ఆమాత్రం తెలివి తేటలు లేకపోతే ఎలా ? రామ రామ. లోకంలో ఎవరూ ఉండరిలాగ..." ఈ ధోరణిలో ఆమె మతిపోయిన దానిలాగా ఇంకా ఎంత సేపు సణుగుతూ ఉండేదో తెలీదుగాని, అంతలోనే మానాన్న రంగ ప్రవేశం చేసి మమ్ములను రక్షించాడు. ఆయన ముందు గదిలో నుంచి వరండాలోకి వస్తూ ' ఏమిటే! ' అన్నాడు కళ్ల జోడు సర్దుకుంటూ పరమ చాదస్తంగా. అంతలో ఎవరో బిందె తీసుకుని నీళ్ళకోసం వచ్చారు. మా అమ్మ గయ్యిమని లేచింది. ' ఏం ? అందరికీ ఇది ధర్మ సత్రం అనుకున్నారా ?' ఊరంతా ఇక్కడే నీళ్ళు తోడుకోక

పోతే, మరోచోటికి పోరాదు ? చూస్తున్నాకదా! రోజు తెల వారడం తోటే తయారు. ఊళ్లో ఇక బావులే లేవా ? "నీళ్ళకు కరువొచ్చిందా ? మెత్తగావుంటే అంతే"

ఆవచ్చిన వారిద్దరూ తెల్లబోయి కొద్ది క్షణాలు వింటూ బొమ్మల్లాగా నిలబడి పోయి, అంతలోనే తెప్పరిల్లి, ఏమను కున్నారో ఏమో, ఏమీ మాట్లాడకుండా వెనుదిరిగి వెళ్లి పోయారు.

మానాన్న 'ఏమిటే ? ఏమయింది నీకు ?' అన్నాడు అనవసరంగా. ఆమె మళ్లీ యిటు తిరిగింది. "ఏమయిందీ ? ఏమయిందీ?' అని అడుగుతున్నారా ? ఏమీ కాలేదూ ? ఇంత కష్టపడి సంబంధం చూసి , ఇంత తిరిగి, ఇన్ని ఆశలు పెట్టు కున్నాను ? ఉన్నట్టుండి ఇలా అయితే బాధగా ఉండదూ ? అవున్లెండి. మీకేంతెలుస్తుంది నాబాధ ? ఎదిగిన పిల్ల చదువు పేరిట పరాయి ఊళ్లో ఒంటరిగా ఉంటే అది నాకు బాధగాక మీకా ? మీరేం పట్టించు కుంటున్నారు గనక ? అంతా నాతలరాత. ఒకర్నని ప్రయోజనం ఏముందీ ?... " ఈ విధంగా మతిచెడిన దానిలాగా అమ్మ నసపెట్టడం ప్రారం భించింది. దాంతో నాన్న మతి పోయినవాడిలా కొన్ని క్షణాలు ఆమె వంక చూసి అంతలోనే ఏమనుకున్నారో ఏమో, చివా లున లేచి వీధిలోకి వెళ్ళిపోయాడు. ఆయన ఆవిషయం లో గొప్ప నేర్పరి. ఇబ్బంది ఏదైనా వొస్తే అలా తమాషాగా తప్పుకుంటాడు.

అలా నసుగుతూనే అమ్మ భుజాన వేసుకున్న తడి గుడ్డ లను కోపంగా విదిలిస్తూ తాడు మీద ఆరవేయడం కొనసాగిం చింది.

నేనూ, ఉమా ఇద్దరం ఏమీ మాట్లాడకుండా బొమ్మ

ల్లాగున కూర్చుండి పోయాము. మనసు తేలిక పడి మల్లె పూల బంతిలాగ హాయిగా వుంది. ఉన్నపళంగా హాయిగా కూనిరాగం తీయాలనీ, హుషారుగా గంతులు వెయ్యాలనీ అని పించింది. కాని అమ్మను చూస్తూ వుంటే జాలికలిగింది. నిజమే, పాపం ! ఎన్ని ఆశలు పెట్టుకుందో ఈ సంబంధం కుదురుతుందని. నా ఆనందం ఆమెకు దిగులుకు కారణ మైంది.

ఆమె చివరిసారిగా గుడ్డను విదిలించి ఆరవేసి 'నేను చెయ్యలేను బాబూ...' అనుకుంటూ విసవిసనడుస్తూ లోప లికి వెళ్లింది.

నా కళ్ల ముందు మళ్లీ కాలేజీ, హాస్టల్ జీవితమూ అందులోని ఆనందమూ మెదిలాయి. నాతోటి విద్యార్థినులూ, వారి సాహచర్యంలో ఉండే హుషారూ అన్నీ గుర్తుకు వచ్చి అలాకూర్చుండి పోయాను.

ఉమ అంతలో 'అమ్మాయి గారూ ! మీకింక నిశ్చింత' అన్నది అవును. ఈ సంబంధం ఎలాగూ కుదిరే అవకాశాలు లేవు కాబట్టి మళ్లీ కాలేజీకి వెళ్లవచ్చు. మళ్లీ ఇలాటి ఉప ద్రవం ఇంతలో రాకూడదని వెయ్యిదేవుళ్లకు మొక్కుకున్నాను. ఒక వేళ ఇలాటి ప్రమాదం వచ్చిపడినా ఇలాగే తేలిపోవాలని కూడా కోరుకున్నాను.

ఉమ మళ్ళీ ' నాసంగతి మరీ అధ్వాన్నం. చూస్తు న్నారుగా ' అన్నది. నేను ఉమ సంగతి సీరియస్‌గా ఆలో చించడం ప్రారంభించాను. 'ఈపిల్ల ఇలా ఇక్కడ ఉండి పోకూడదు. మళ్లీ చదువులో పెట్టించాలి. దానికి కావల సిన పథకం రూపొందించాలి.' అనుకున్నాను.

ఉమా ! రేపు పొద్దున్నే నేను నీ అమ్మతో మాట్లాడ తాను. అవసరమైతే మీనాన్నతోనూ మాట్లాడతాను,

నిన్ను ఇలా ఇక్కడ విడిచిపోను ' అన్నాను నెమ్మదిగా,ఆవేశంగా.

ఉమ నామొహం లోకి చూసింది. ఆకళ్లలో గొప్ప వెలుగు చూశాను. కళ్లలోని తళతళలో కృతజ్ఞత గూడు కట్టుకున్నట్టు కనిపించింది. కాస్సేపాగి 'పొద్దు గూకుతున్నది. వెళ్లొస్తా నమ్మాయిగారూ ! ' అంటూ లేచింది.

'వెళ్లిరా... రేపు ఈ పాటికి రంగం సిద్ధం చేస్తాను చూడు ' అన్నాను నేను.

ఉమ నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్లిపోయింది. నాకు తెలుసు. ఈ రాత్రి అంతా ఆపిల్ల నిద్రపోదు. మనసునిండా మధురమైన ఊహలతో, ఉత్కంఠతో రేపటి వరకూ విశ్రాంతి లేకుండా నిరీక్షిస్తుంది.

తర్వాత లోపలికి వెళ్లి వంటగదిలోకి తొంగిచూశాను. అమ్మ, పాపం పొగతో ఉక్కిరి బిక్కిరి అవుతూ పొయ్యి ముందు కూర్చుని వుంది.

నేను వెళ్లి ' అమ్మా' ! కూరలబుట్ట ఎక్కడే ? ' అని అడిగాను. ఆమె వెనుతిరిగి చూసి 'అదుగో... ఆ అలమరులో కింద వుంది చూడు... కాస్త ఆదొండకాయలు తరిగి పెట్టు... ' అన్నది. నేను బుద్ధిగా కత్తిపీట ముందు వేసు కుని కూర్చుని కూర తరగడం ప్రారంభించాను. కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత ' అమ్మా ' ! అన్నయ్యకు కట్నమెంత తీసు కున్నారే ? ' అని అడిగాను. "ఎంతో ఎక్కడ ? కట్నం తీసుకున్నామని పేరేకాని పెళ్లి ఖర్చులకే చాల్లేదు. మనం అడిగితే కదా ! వాళ్ళు నాలుగు వేలిస్తామన్నారు. పుచ్చు కున్నాం. సంబంధం నచ్చింది అంతే...మనం ఇవేమీ పట్టి చుకోలేదు. పశువుల్ని బేరానికి పెట్టినట్టు మనకు చే కాదుగా ! వాళ్లకు ఓపినంత సంతోషం కొద్దీ యిస్తామన్నారు సరేనన్నాం. మనకీ తెలివితేటలు లేవుగా. పైగా మాట్లా

నోరుగల వాళ్లెవరున్నారు మనకు ? కట్నం తీసుకున్నామని పేరేగాని అందులో సగానికి పైగా నగలే చేయిస్తిమి పిల్లకు. పెళ్లి ఖర్చుకు ఇంకా వెయ్యి రూపాయిలు పైన అయింది. ఇంకా ఆబాకీ కూడా తీరనేలేదు...ఇలాటి బుద్ధులే వుంటే బాగుపడే వుందుము..." ఇలా సాగిపోతున్నది ఆమె ధోరణి.

నేను కాస్సేపాగి వీలుకనిపెట్టి "పోన్లే అమ్మా... ఈ పిప్పళ్ల బస్తాల సంబంధం పోతే పోయింది. దానికోసం బెంగ పెట్టుకోకు" అన్నాను.

ఆమె ఆ మాటలు విని నావైపు అదోలా చూసింది. నేను మళ్లీ కొంచెం ధైర్యంచేసి "రోజులు మారుతున్నాయిలే అమ్మా" ఇలాటి కట్నం దాహం గాళ్ల నందర్నీ జైల్లో పెట్టే రోజులొస్తాయి చూడు అయినా నువూరికే తొందర పడు తున్నావు గాని లోకం గొడ్డుపోలేదమ్మా. అదీ గాక..." అంటూ ఒక్క క్షణం ఆగాను, ఎందుకైనా మంచిదని. ఆమె నావంకనే చూస్తున్నది. ఆకళ్లలో కోపంగాని, వ్యతిరేకత గాని లేదని పసిగట్టి మళ్లీ నెమ్మదిగా మొదలుపెట్టాను.

"అదీగాక... ఇంకోసంవత్సరం ఆగితే నా డిగ్రీ చదు వయిపోతుంది. మరొక్క రెండు సంవత్సరాలు ఓపిక పడితే ఎం.ఏ పూర్తయిపోతుంది. నిక్షేపంలాగా ఎక్కడైనా లెక్చెరరు ఉద్యోగం కళ్లకద్దుకుని ఇస్తారు. ఆడపిల్లల కాలేజీల్లో ఈ మధ్య ఆడపిల్లలకు వేరేగా కాలేజీలు లెక్కలేనన్ని పెడుతు న్నారు. తెలుసా ? "

ఆమెలో, ఆమె చూపులలో మార్పు లేదు. సాను భూతి తోనే వింటున్నది. అందుకని మళ్లీ కొనసాగించాను.

"ఆడపిల్లల కాలేజీల్లో ఉద్యోగం హాయిగా వుంటుంది. మగవాళ్ల గొడవ వుండదు. వేరేగా హాస్టళ్లుంటాయి. చక్కగా ఉండవచ్చు. అప్పుడు ఈ పిప్పళ్ల బస్తా సంబం

ధాలు కాదు రాజాలాటి సంబంధాలొస్తాయి. ఈ కష్టాం
చదివింపులు... అలకలు...ఈ న్యూసెన్సు ఉండదు..''

నా మాటలు శ్రుతిమించి పోతున్నాయేమోననీ, కథ
అడ్డంతిరుగు తుందేమోననీ భయం వేసి అంతలోనే మళ్ళీ
గొంతులో గంభీర్యం తెచ్చిపెట్టుకుంటూ ,

'అయినా...ఆడపిల్లగా పుట్టడం కన్నా అడివిలో మానం.
పుట్టడం బెటరు... ఆడపిల్లగా పుట్టి తల్లిదండ్రులకు
ఇంత చింత, దుఃఖం కలిగించడం కంటే పుట్టగానే చావడ
మేలు...'' ఇలా అంటూనే కత్తి పీట మొనమీద సుతారంగా
వేలుతాకించి ' అబ్బ' అన్నాను.

'అయ్యో ! కోసుకున్నావుటే, ఏదీ నెత్తురొస్తున్నదా ?
అన్నది అమ్మ కంగారు పడుతూ.

"ఏం లేదులే... '' అన్నాను నేను.

"లే... నువ్వు ఏమీ చెయ్యనక్కర్లేదు గాని , వెళ్ళి
తడి గుడ్డ చుట్టుకో వేలికి. అయినా అలవాటు లేనిపనుల
కెందుకే తయారవుతావు ? ''.

నేను బతుకు జీవుడా అని దొడ్లోకి వెళ్ళి చిన్న గుడ్డ
ముక్క సంపాదించి తడిపి చూపుడు వేలికి చుట్టుకుని మళ్ళీ
వచ్చి వంటయింట్లో కూర్చున్నాను. అమ్మ ప్రశాంతంగా
కూర తరుగుతూ కూర్చుని వుంది.

రాత్రి ఎనిమిది గంటలు దాటి వుంటుంది. అప్పుడు
నెమ్మదిగా లోపలికి వచ్చాడు మానాన్న. గుమ్మం దగ్గ
నెమ్మదిగా చెప్పులు వదలి నన్ను సైగ చేసిపిలిచాడు. నే
దగ్గరికి వెళ్ళి ' ఏమిటి నాన్నా ' అని అడిగాను.

" ఉష్ ! నెమ్మదిగా మాట్లాడు. ఏమంటున్నది
అమ్మ... '' అన్నాడు చొక్కా విప్పుతూ.

"నువ్వెళ్ళ గానే నన్ను పిలిచి దగ్గర కూర్చో బెట్టుకుం

న్నా !''ఈ పిప్పళ్ల బస్తాల సంబంధం తప్పిపోతే పోయింది. ఫైనా మనమంచికే అంటారిదే కాబోలు. నువ్వుహాయిగా చదువుకో. ఈ కట్నం పేరున ఎవరికో ధారపోసే డబ్బులో నాలుగో వంతు ఖర్చు పెడితే, మూడేళ్లలో నువ్వు లెక్చరరు వైపోతావు. ఆడపిల్లల కాలేజీలు తెగ పెట్టేస్తున్నారు దేశం నిండా... అప్పుడు రాజా లాటి సంబంధాలు తన్నుకుంటూ వస్తాయి. ఇక ఇంతలో ఇట్లాంటి ప్రయత్నాలు చెయ్యవద్దని మీనాన్నతో చెబుతాను... ' అన్నది నాన్నా !''

మానాన్న చొక్కా సగం విప్పి అలాగే ఆశ్చర్యంతో వింటూ నిలబడిపోయాడు. తర్వాత ఎందుకో నవ్వాడు. చొక్కా తీసి దణ్ణెంమీద పడేస్తూ "మంచిదే... విప్లవం వొస్తున్నదన్న మాట...బాగుంది...చాలా బాగుంది...''అన్నాడు.

నేను మళ్లీ "అమ్మ ఇంకా చాలా చెప్పింది నాన్నా... ఈ కట్నాల దురాచారం ఎంత ఘోరమైందో, వీటి వల్ల ఎన్ని మధ్య తరగతి కుటుంబాలు నాశనమైపోతున్నాయో అని ఎంతో బాధ పడిపోయింది. 'మన యింట్లో మళ్లీ మరో కట్నం పెళ్లి జరగడానికి వీల్లేదు. నువ్వు చదువై పోయాక ఉద్యోగంలో చేరు. అప్పుడే చూసుకోవచ్చు. ఇప్పుడు కొంప మునుచుకుపోయిందేమీ లేదు ' అని కూడా అన్నది ''.

నాన్న హుషారుగా నవ్వుతూ ' అబ్బో ! చాలా దూరం నడిచిందే కథ... ' అన్నాడు. మళ్ళీ వాలు కుర్చీలో కూర్చుని కళ్లు మూసుకుని " మంచిదే... ఊ...చాలా మంచిది... " అన్నాడు. అంతలో అమ్మ లోపలినుంచి వొచ్చింది. గుమ్మం దాటుతూనే వాలుకుర్చీలో నాన్నను చూసి " ఎంతసేపయిం దండీ వొచ్చి... పిలవనైనా లేదేం ? ... " అన్నది.

"ఏదీ, ఇప్పుడే వచ్చాను... ఆ పేరయ్య శాస్త్రి కబురు

చేస్తే వెళ్లాను. అన్నట్టు పెళ్లాంపోయి సంవత్సరం కాలేదు వాడప్పుడే పెళ్ళికి తయారవుతున్నాడు. దారుణం... "

మాఅమ్మ ఆశ్చర్య పోతూ గుమ్మంలో కూలబడి "ఊం! అనుకుంటూనే వున్నాను. నలుగురు పిల్లలున్నారు. నడి వయసుదాటింది. ఇప్పుడీ బుద్ధి ఏమిటి ? " అన్నది.

" అదే... ఆపిల్లలను చూసేందుకే ఒక మనిషి కావాలిట... అందుకు గాను పెళ్లి చేసుకుంటాట్ట. కట్నం వగైరా లేవీ అక్కర్లేదట... పిల్ల మాత్రం అందంగా ఉండాలిట "

"ఓరి నీడికి చిచ్చు పెట్టా. ఇంత బతుకూ బతికి ఇవేం బుద్ధులు. పోగాలపు బుద్ధులు కాకపోతే..."కట్నం గురించి కూడా ప్రస్తావన చేశాడా ? కలికాలం... కలికాలం కాబట్టే ఇలాంటి వెధవ బుద్ధులు పుట్టుకొస్తున్నాయి...సరే లేవండి...వాడ్డిస్తాను...మంచి వార్తలే తెస్తారు మీరు..."

"నన్నేం చెయ్య మంటావు... చెప్పాడు...విన్నాను... అంతే... " అంటూ లేచాడు నాన్న.

భోజనాల ముందు ఆయన ఉన్నట్లుండి " నీలో వచ్చిన మార్పుకు నాకెంతో ఆనందంగా ఉంది... " అన్నాడాయన.

"ఏమిటి ? " అన్నట్లు చూసింది అమ్మ.

"అదే ... నువ్వు అమ్మడిని చదువుకోమనే చెప్పావుగా. ఇంతలో వేలకు వేలు కట్నాలు పోసి పెళ్లి చెయ్యా వలసిన అవసరం ఏముందిలే.

నువ్వనట్టు దాన్ని చదువుకోనిస్తే ఉద్యోగంలో చేరాక అప్పుడే వస్తాయి సంబంధాలు. నీ పుణ్యమా అని ఇ సంబంధాల కోసం అడ్డమైన చోట్లకూ, తిరగడం, అడ్డమైన వాళ్లకాళ్లు పట్టుకోడం బాధ నాకూ తప్పుతుంది. నువ్వే రైటు ... " అన్నాడాయన.

మా అమ్మ మలిపోయిన దానిలాగ కాస్సేపు ఆయన వంక చూసి తర్వాత పక్కనే కూర్చున్న నావైపు చూపులు తిప్పింది. నేను నెమ్మదిగా తలఎత్తి భయంతో ఆమె ముఖంలోకి చూశాను. ఆమె పెదవుల మీద చిరునవ్వు కనిపించి ' అమ్మయ్య ' అనుకుని చివాలున లేచి ముందుగదిలోకి వచ్చి కూనిరాగం తీస్తూ మంచం మీద కూలబడ్డాను.

ఇక్కడికి ఒక గొడవ సెటిలయింది...

ఇక... రేపు...?

మరునాడు ఉదయం నిద్రలేస్తూనే కళ్ళు తెరిచి కిటికీలోనుంచి చూస్తే పలుచటి బంగారు రంగు ఎండ కనిపించింది. గోడపక్కగా ఉన్న గన్నేరు చెట్టు పసుపు పచ్చని చిన్న చిన్న బంగారపు ముద్దల వంటి పూలతో నిండుగా కనిపించింది. కిటికీ పక్కగా ఒత్తుగా పెరిగిన గులాబీ మొక్కకు అరచేతి వెడల్పున ముదురు ఎర్ర రంగు పూలు రెండు పూచి నీటి బిందువులతో పిల్లగాలికి అటూ యిటూ కదులుతూ మనోహరంగా వున్నాయి. రంగురంగుల చిన్న పిట్ట ఒకటి ప్రహరీ గోడ మీద తిష్ట వేసుకుని కూర్చుని రాగాలు తీస్తున్నది.

నిన్న జరిగిన దంతా నెమరు వేసుకుంటూ బద్ధకంగా అలాగే పడుకుని వున్నాను. అంతలో కిటికీ పక్కన గులాబీ మొక్క పక్కనుంచి సన్నగా సుతిమెత్తని పిలుపు వినవచ్చి తల తిప్పి చూశాను. ఉమ నవ్వుతూ కనిపించింది. హుషారుగా లేచికూర్చుని 'లోపలికి రమ్మని' సైగ చేశాను.

మరు నిముషంలో నెమ్మదిగా లోపలికివచ్చి గోడ పక్కగా నగిల బడి కూర్చున్నది ఆపిల్ల. పాతదైనా శుభ్రంగా న్న పసుపు పచ్చని రంగు వోణీ...తెల్లని పరికిణీ మీద నల్లని కెట్టు... మెడలో సన్నని పూసల దండ... నల్లగా ఉన్నా

కళగల ముఖం. చెంపలకు చేరెడేసి తెల్లని కళ్లు ...నవ్వుతున్నప్పుడల్లా మెరిసే పలువరస పేదరికమనే మసి గుడ్డలో చుట్టబడిన వజ్రంలాగున్నది ఉమ.

నేను కృత నిశ్చయురాలినై వున్నాను. ఆవిషయమై రాత్రి పడుకున్న తర్వాత పొద్దు పోయే వరకూ ఎంతో ఆలోచించాను. ఎట్టి పరిస్థితులలోనూ, ఎవరు ఏమన్నా సరే ఎన్ని అవాంతరాలు ఎదురైనా సరే ఈపిల్లను నాతో తీసుకువెళ్లి స్కూల్లో చేర్పించాలి ఇది నానిశ్చయం.

నేను లేచి మంచం చివరకు జరిగి ఉమను ఇంకా ముందుకు జరగమని సైగ చేశాను. ఆమె ఉత్కంఠతో ముందుకు జరిగింది.

"మరో వారం రోజుల్లో నేను వెళ్లిపోతున్నాను. నిన్నటి బస్తా సంబంధం తప్పిపోయింది. గండం గడిచింది అంటేవాడు. ఇంతలో మళ్లీ సంబంధాలు చూడరు. ప్రస్తుతానికి బెడత తప్పిపోయినట్టే".

ఉమ ఉత్కంఠతో ఆనందంగా వింటున్నది.

"శ్రద్ధగా విను. రాత్రి అంతా నిన్ను గురించి చాల ఆలోచించాను".

"నన్ను గురించా ?" అన్నది ఉమ కొంచెం ఆశ్చర్యంగా

"అవును నిన్ను గురించే. నేను వెళ్లేటప్పుడు నిన్ను కూడా తీసుకుపోతాను. అక్కడ స్కూల్లోచేరి చదువు కుందువుగాని".

ఉమ కళ్లు మరింత పెద్దవైనాయి. నెమ్మది గొణుగుతూ

"కాని ... మానాన్న..." అన్నది ఏదో అనుమానం

"మీ నాన్నతో నేను మాట్లాడతాను. అంతా చెప్పి ఒప్పిస్తాను".

"ఏం చెబుతారు ?" ఉమ గొంతులో మరింత ఆశ్చర్యం ధ్వనించింది.

"అన్నీ వివరించి చెబుతాను. నిన్ను చదువుకో నీయకుండా ఈ పల్లెటూల్లో జైల్లోలాగా ఉంచడం తప్పని చెబుతాను. నువ్వు తెలివిగల దాని వనీ చదువులో పెడితే చాలా గొప్పదాని వవుతావనీ, సంగీతం నేర్పిస్తే నీకు గొప్ప భవిష్యత్తు వుంటుందనీ, అప్పుడు నువ్వు ఉద్యోగంలో చేరి బోలెడంత డబ్బు సంపాయిస్తావనీ చెబుతాను. ఇక్కడే వుంచితే చదువూ చట్టుబండలూ లేక ఎందుకూ పనికిరాకుండా ఒక పనిమనిషిగా అంట్లు తోముకుని బతుకుతావని చెబుతాను. నువ్వేమంటావు ?"

ఉమ బిక్కు బిక్కు మంటూ చూసింది. ఆమె కళ్లలో దిగులు...అనుమానం...భయం...ఇన్ని కనిపించాయి.
నేను నెమ్మదిగానే అయినా దృఢంగా అన్నాను "నువ్వు ముందు ఇది తేల్చి చెప్పు. నీకు చదువుకోవాలని ఉందా ? లేదా ?"

ఉమ భయంగానే తలవూపింది.

"సంగీతం కూడా నేర్చుకుని గొప్పదాని వవుదామని ఉందా, లేదా ?"

ఉమ మళ్లీ తలవూపింది.

"ఏదీ లేకుండా ఈ పల్లెటూళ్లో ఆయింట్లో ఈ యింట్లో అంట్లు తోము కుంటూ పనిమనిషిగా బతుకు దామని వుందా ?"

పెద్ద పెద్ద కళ్లలో బెదురు...

" ఎవడో అంట్లు వెధవవచ్చి వచ్చే యేడో ఆపై సంవత్సరమో ముడిపెట్టి ఇక్కడే నిన్ను శాశ్వతంగా బంధించి వేస్తారు...తప్పదు...ఇదంతా నీకిష్టమేనా ?"

ఉమ కళ్లు నీటిపొరలో తళ తళ లాడుతున్నాయి. తల

అడ్డంగా ఊపుతూ '' ఊఁ హుఁ! నాకట్లా బతుకుదావని లేదు '' అన్నది.

''మరి ? '' అనిరెట్టించాను.

''చదువుకోవాలని ఉంది. చదువుకుని ఉద్యోగం చెయ్యాలని ఉంది. చదువుకుంటూ సంగీతం నేర్చుకుందా మని వుంది.''

''మరయితే... '' అంటూ లేచాను నేను.

'' నేను చెప్పినట్టు విను. బాధ్యత అంతానాది. కేవలం నువ్వు ఏమీ ఎదురు మాట్లాడకుండా ఉంటే చాలు. నేనంతా సరిచేస్తాను. అన్నట్టు నీ మామయ్య మంచివాడ న్నావు కదూ ? అక్కడికి వెడితే స్కూల్లో చేర్పించి చదువు చెప్పిస్తాడా ? లేకపోతే అక్కడ కథ అడ్డం తిరుగుతుందా ? ''

ఉమ గట్టిగా విశ్వాసంతో అన్నది. ''లేదు. ఆయన ఎంతో మంచివాడు. నా చదువు ఆపవద్దనీ, ఎంత వరకూ చదువు కుంటే అంతవరకూ తానే నాకు చదువు చెప్పిస్తాననీ నాన్నతో గట్టిగా వాదించాడు కూడా ''

''సరే అయితే. కాస్సేపటిలో మీయింటికి పోదాం.'' అన్నాను.

''మీరా ? మాయింటికి వస్తారా ? '' ఉమ ఆశ్చర్య పోయింది.

''అవును. మనమే మీయింటికి పోదాం. కిందా మీదా పెట్టి ఎలాగో అక్కడే ఒప్పందం కుదుర్చుకుందాం... మాస్తావుగా నా తడాఖా... ''

మరో గంటలో పనులన్నీ పూర్తి చేసుకుని వంటగదిలోకి తొంగి చూశాను. అమ్మ అప్పటికే వంటగదిలో యమా బిజీ గా వుంది.

''అమ్మా ! ఏంతోచడం లేదు. అలా పద్మగారింటికి

వెళ్లొస్తాను''. అన్నాను.

''ఏం ? ఎందుకు తోచదు ? పనిలేకపోతే సరి. ఇలా వచ్చి ఈ కూరలు తరిగిపెట్టకూడదూ ? వంటలో కాస్త చేతిసాయం ఉండగూడదూ ? పద్మ గారింటికి వెళ్లి పిచ్చి కబుర్లు చెప్పుకోడమో, లేకపోతే ఆటలాడుకోడమో ... అంతేగా...'' అని గయ్యమని లేస్తుందేమోనని భయపడ్డాను.

కాని అలాటిదేమీ లేదు. ఆమె చాలా ప్రశాంతంగా ''అలాగే...వెళ్లిరా...కాస్త పెందలాడే వచ్చెయ్ '' అన్నది.

'బ్రతుకుజీవుడా' అనుకొంటూ బయటికి వచ్చాను. పది గంటలవుతున్నదేమో. వరండాలో మూడువంతులు ఎండ పడుతున్నది. గోడనానుకుని కూర్చునివుంది ఉమ. ప్రహరీ గోడపైగా కనిపిస్తున్న తెల్లని ఆకాశంలోకి చూస్తున్నది. వరండా చివరకు వచ్చి '' పోదాంపద '' అన్నాను.

అలాగే కూర్చుని నావంక భయంభయంగా చూసింది.

నేను దగ్గరికి వెళ్లి తలమీద చెయ్యి వేసి '' భయమెందుకూ ? మనం పోతున్నది సింహం దగ్గరికో, పులిదగ్గరికో కాదుగా ? మీనాన్న దగ్గరికేగా ? ఏం ఇప్పుడు ఇంట్లో వుండడా ?'' అన్నాను.

ఉమ తల వూపుతూ '' ఉంటాడు'' అని బదులు చెప్పింది.

'' మరి, రావేం ? ''

నెమ్మదిగా కదిలింది గాని లేవలేదు. అంతలో మళ్లీ నసుగుతూ'' ఇంట్లో నే వుంటాడు గాని...ఎట్లా వున్నాడో,'' అన్నది.

''అంటే ? ''

''మీకు తెలిదమ్మాయి గారూ ? '' అంటూ ఉమ దగ్గరగా వచ్చినిలబడి ''మానాన్న తాగుబోతు.రోజూ రాత్రిళ్లు

తాగి వొస్తుంటాడింటికి... '' అన్నది.

నేను నవ్వాను. '' అయితే మరీ మంచిది. తాగు బోతువాళ్ళకు మాట పెళుసే గాని మనసు మెత్తన. అయినా ఇది పగలు.పదపోదాం '' .

''మిమ్మల్ని ఏమన్నా అంటాడేమో ? ''

''ఏమీ అనడు. నువ్వువూరికే చప్పు పెద్దమ్మ లాగా ప్రతి దానికీ భయపడుకు. ఇట్లా అయితే ఏ పనీ కాదు -''

ఉమ లేచి బయలుదేరింది.

ఇద్దరం చురుకుగా అడుగులు వేస్తూ వీధిలోకి వచ్చాము.

వీధిమలుపు తిరిగామో లేదో మానాన్న చేతిలో తిలకాష్ఠ మహిష బంధంలాటి కవిలెకట్టతో ఎదురై కళ్ళజోడులోనుంచి మాయిద్దరి వంకా చూస్తూ '' ఎక్కడికే బయల్దేరారూ ? '' అని ప్రశ్నించాడు.

నేను గబుక్కున '' పద్మావాళ్ళింటికి నాన్నా ! ఈ పిల్ల ఏమో నాకుతోడుగా వొస్తున్నది '' అన్నాను.

''అలాగా ? అయితే త్వరగా వచ్చేయండి, కబుర్లలో పడక...'' అంటూ ఆయన ముందుకు సాగిపోయాడు.

ఎండలో చురుకుసాలు ఎక్కువైంది. ఉమ ముందు నడుస్తున్నది. నేను నుదుట పట్టే చెమటను కొంగుతో తుడుచుకుంటూ ఆమె వెంటనే నడుస్తున్నాను. అంతలో ఉమ మాట్లాడటం ప్రారంభించింది.

''మానాన్న మొదట్లో సైన్యంలో పనిచేసేవాడండి... యుద్ధమైపోయాక బర్మానుంచో ఎక్కణ్ణుంచో తిరిగి వచ్చే శాడండి. ఈ ఊళ్లో దక్షిణంగా మాకు ఒక అర ఎకరం పొలం కూడా ఉండేదండి. కాని పంట పండకా ఇబ్బందిగా వుండి అకాస్తా అమ్మేసి మానాన్న పెళ్లయిన కొత్తల్లో రోడ్డు

మీదహోటలు పెట్టాడండి. రెండుమూడేళ్లు బాగానేగడిచింది. కాని ఆతర్వాత హోటలు దివాలా తీసిందండి. అంతే. మా నాన్న ఏమీ తోచని వాడిలాగ ఏమీ చెయ్యకుండా ఇలాగై పోయాడండి ''

ఆతర్వాత మాటలు ఆపింది. అప్పటికి ఊరిచివరకు వచ్చాము. పైగట్టుమీద నిలబడ్డాము. ఒకవైపు వూరి చెరువు. అందులో ఎప్పుడూ నీళ్లుండవు. ఒక పక్కగా పోలేరమ్మ గుడి...చుట్టూ ఈత చెట్లు...చెరువు కట్ట క్రింద రోడ్డు. రోడ్డు పక్కన అంతులేకుండా పెరిగిపోయిన తుమ్మ చెట్లు...దూరంగా మంచినీళ్ల బావి.

చిన్న కాలి బాట చూపించింది ఉమ చూపుడు వ్రేలితో. తుమ్మల మధ్యగా నడిచి వెళ్లాము. ఎత్తుగా రాళ్లమీద కట్ట బడిన చిన్న యిల్లు...పైకప్పు తాటాకులదే కాని గోడలు మాత్రం బలమైన కొండరాళ్లతో కట్టారు. చిన్న వరండా. లోపల ఒకటే గదిలాగుంది. వరండాలో నులక మంచంలో పడుకుని పైకి చూస్తూ ఏదో పదంపాడుతున్నాడు ఉమ తండ్రి. అతని పేరు నారయ్య.

కొద్ది దూరంలోనే ఆగి ఉమ ఎందుకో నాచెయ్యి పట్టుకుంది హఠాత్తుగా. నేను నవ్వుతూ ఆమె చేతిని నిమిరాను.

'ఏమీ ఫరవాలేదు లెమ్మ'ని భరోసాయిచ్చాను సైగలతో. నాకాలి క్రింద ఎండినకొమ్మ విరిగిన శబ్దానికి మంచంలో పడుకుని వుండే తలతిప్పి చూశాడతడు. వెంటనే లేచికూర్చున్నాడు. కళ్లు పెద్దవి చేసుకుని మాయిద్దరి వైపు చూశాడు.

అప్పుడు గమనించాను నేను. మంచం పక్కనే స్తంభానికి కుంటివాళ్లు వాడుకునే కర్ర లున్నాయి. అతని కొక కాలు లేదు.

ఉమ ముందుకు వచ్చి '' అమ్మాయిగారు... పట్నంలో

చదువుకుంటున్నారు. కాలేజీలో " అన్నది.

అతడు నవ్వాడు. ఉమ ఈలోపలే లోపలికి వెళ్ళి ఒక పాత చాప తెచ్చి పంచలో పరిచింది.

నేను పంచ చివర కూర్చున్నాను. "కింద కూర్చుంటా వెందుకమ్మా ? " అంటూనే అతడు నావంక చూస్తూ "నీపేరేమిటి తల్లీ ? " అని అడిగాడు.

"వసుంధర..." అని చెప్పాను.

"బాగుందమ్మా. మా అమ్మాయికి వాళ్ళ నాయనమ్మ పెట్టింది పేరు, ఉమ అని. ఆడపిల్ల పుట్టిందని ఒకటే మురిసి పోయేది పిచ్చిది. ఏంలాభం ? ఏమీచూడకుండానే దాని మూడో యేటో, నాలుగో ఏటో చచ్చిపోయింది ".

నేను నెమ్మదిగా "ఉమ చెప్పింది మీరు యుద్ధంలో పని చేశారని " అంటున్నాను.

అతడంతలో నిట్టూర్చి " ఏం యుద్ధమోలే అమ్మా ! కడుపు కోసం ఏపనీ దొరక్క చేశాను. బ్రిటిషోడి హయాంలో దేశాలన్నీ తిరిగాను. చావుదప్పి కన్నులొట్టపోయినట్టు ఇట్టా ఏమీ చేతకాని వాణ్ణయి పోయాను " అన్నాడు దిగులుగా.

ఎదురుగా చిన్న తాటి చెట్టు పక్కన సూర్యబింబం... వేసవి కాలమంతా తన ప్రతాపాన్ని చూపించి సమస్త ప్రపంచాన్ని పెనం మీద వేయించినట్టు ఉడికించి వేసిన సూర్యుడు శౌర్యం ఉడిగిన వృద్ధవీరుడిలా ఉన్నాడు. అప్పుడప్పుడు ఆకాశంలో మబ్బులు ప్రత్యక్షమై ఉండి ఉండి గర్జించి పోతున్నాయి. నిన్న సాయంకాలం సన్నని చినుకులు పడ్డాయి కూడా.

అతడు నిట్టూర్చి సర్దుకుని కూర్చున్నాడు. నేనతని వంక తిరిగి అతని ముఖం లోకి కన్నార్పకుండా చూశాను.

మాసిన గడ్డం, కళలేని కన్నులు, దుబ్బుగా పెరిగిన జుట్టు ఎక్కడో చూస్తున్నట్టున్న చూపులు.

నేను హఠాత్తుగా అన్నాను " మీ ఉమ తెలివైన పిల్ల. పాటలు కూడా బాగా పాడుతుంది. చదువెందుకు మాన్పించారు ? చదువుకుంటే ఎంతో పైకొస్తుంది "

అతడు నావంక కళ్లు పెద్దవి చేసుకుని చూస్తూ ఉండిపోయాడు. కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత మళ్లీ అన్నాను.

"నేను తొందరలో వెళ్లిపోతున్నాను. అక్కడ కాలేజీలో నాచదువు. ఉమను కూడా నాతో పంపిస్తే తీసుకుపోయి మళ్లీ స్కూల్లో చేర్పిస్తాను. అక్కడ వాళ్ల మామయ్య ఉన్నాడని, ఆయన తనను చదివిస్తాడనీ అన్నది ఉమ. మీకేమీ ఇబ్బంది గానీ ఖర్చుగానీ ఉండదు. పైగా ఉమ విషయాలన్నీ నేను చూసుకుంటాను. మీకేమీ భయం అక్కర్లేదు"

అతడలాగే వింటున్నాడు.

"ఉమకు చదువుకోవాలనీ, సంగీతం నేర్చుకోవాలనీ ఎంతో అభిలాష. అందుకు తగిన తెలివితేటలు, అర్హతలు అన్నీ ఉన్నాయి. ఆలోచించండి. చదువుకుని పైకిరావలసిన పిల్లను ఇక్కడ పనిమనిషిగా తయారు చెయ్యడం ఘోరం. అవకాశాలు లేక చదివించలేకపోతే అదివేరు. కాని వాళ్ల మామయ్య " అంటూ ఆగాను. అంతలోనే మళ్లీ "అసలు వాళ్ల మామయ్య ఉమను చదివిస్తానని అన్నమాట నిజమేనా?" అని అడిగాను.

అప్పుడతడు తలవూపాడు.

"అయితే, ఇక ఆలోచన దేనికి ? "

అతడు ఇబ్బంది పడుతున్న వాడిలా " సరాయి ఇంట్లో నాపిల్లను చదివించడానికి మనసొప్పలేదుతల్లీ? లేకపోతే పిల్ల చదువు కుంటానంటే వొద్దంటామా? మాకెట్లాగూ

శక్తి లేదు...'' అన్నాడు నెమ్మదిగా. ''అది పరాయి యిల్లా? ''

'' మరి ? ''

అనుకోకుండా హఠాత్తుగా అనేశాను. ''మీచెల్లెలుపోయే సరికే ఆయన పరాయి వాడై పోయాడా? '' అని.

అతడు గుడ్లు పెద్దవి చేసుకొని చూశాడు. ''ఆయన చాలా మంచివాడని చెప్పింది ఉమ. అదినిజమేనా?''

' నిజమే' అన్నట్టు తలవూపాడతడు.

''అయితేఇంక అనుమానం దేనికి? ''

అతడు ఆలోచిస్తున్నాడు. నేనుఊరుకోలేదు. లోహం వేడిగా ఉన్నప్పుడే దెబ్బకొట్టాలి. అందుకని అన్నాను.

'' కాలం మునుపటిలా లేదు. మునుపంటే చదువు కున్నా, చదువుకోక పోయినా గడిచిపోయేది. ఎలాగో ఒకలాగా గడిచి పోయేది. ఇప్పుడు చదువు అవసరం. చదువుకోకపోతే వెనకబడి పోవడమే. మునుపు మగపిల్లలు చదువుకుంటే చాలు లెమ్మని అనుకునేవారు. ' ఆడపిల్లలకు చదువెందుకు? ఉద్యో గాలు చెయ్యాలా? ఊళ్లేలాలా?' అని అనుకునే వారు. కాని కాలం మారింది. ఇంకా మారుతున్నది. ఆడపిల్లలు చదువు కోకుండా జీవితమంతా పనివాళ్లుగా ఉండరు. వాళ్లూ చదు వుకొని ఉద్యోగాలు చేస్తున్నారు. ఊళ్లేమిటి? దేశాలే ఏలుతు న్నారు. ఉమ తెలివితేటలు చదువులోనే రాణిస్తాయి. అంట్లపనిలో రాణించవు. ఆమె ఏం కాబోతున్నదో ఎవరికి తెలుసు ? చదువు పూర్తయి ఉద్యోగస్తురాలు అవుతుందో! సంగీతం నేర్చుకుని గొప్పగాయని అవుతుందో మనం చెప్పలేను కదా ! రెంటిలో ఏదయినా మీకే ఆనందం... మీకే సుఖం చదువు చట్టుబండలూ లేకుండా ఇలాగే ఇక్కడే ఉండి.. పనిమనిషిగా తయారైతే మీరు ఆనందంగా ఉండ గలరా

ఆలోచించుకోండి. ...చిన్నదాన్నే అయినా చెబుతున్నాను"

అతడు సర్దుకుని కూర్చుని ఆలోచనలో పడ్డాడు తర్వాత నావంక ఒకసారి తలతిప్పి చూశాడు. భుజంపైగా తలతిప్పి వెనుక బిక్కుబిక్కుమంటూ నిలబడివున్న కూతురివైపు చూశాడు.

అంతలో నేను లేచాను. చేతులు దులుపుకుంటూ "తొందరేం లేదు, నెమ్మదిగా ఆలోచించుకునే ..." అంటున్నాను.

అతడు "ఇందులో ఇంకా ఆలోచించేదేముంది తల్లీ? నువ్విప్పుడు కొత్తగా ఏమీ చెప్పలేదు....ఈ చర్చ అంతా ఇంతకు ముందే అయింది. తర్జనభర్జనలు అన్నీ అయినాయి. కాక పోతే ఎందరెన్ని చెప్పినా వినక నేనే అంతా చేశాను...మొండికేశాను." అంటూ ఉమ వంక తిరిగి "లోపల పెట్లో నాచిన్న సంచీ పట్టుకురా..." అన్నాడు.

ఉమ లోపలికి వెళ్లి మరుక్షణంలో ఒక హ్యాండ్‌బ్యాగ్‌తో వచ్చింది. అతడు దాన్ని అందుకుని అందులోంచి ఒక చిన్న పాత పర్సు తీశాడు.

హ్యాండ్‌బాగ్ అవతల వుంచి పర్సులో నుంచి డబ్బు తీసి లెక్కపెట్టాడు.

తర్వాత నిట్టూర్చి 'వంద రూపాయలున్నాయి.' అన్నాడు.

నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"ఎందుకైనా ఉంటుందని ఈ డబ్బు ఎప్పుడో దాచి పెట్టాను...ఇది తప్ప ఇంకేమి లేదు కూడా. నేను పిల్లదానికేమి ఇవ్వగలనో, ఏం చెయ్యగలనో నాకు బాగా తెలుసు. నేనెందుకూ పనికిరాని అశక్తుణ్ణి. అందుకే బాధ పడుతూనే దాన్ని చదువు మాన్పించాను. ఇన్నాళ్లూ అంటే నాతోడ

బుట్టన చెల్లెలు ఉంది కాబట్టే దాన్ని బాగా చూసింది. కడుపులో పెట్టుకుని కాపాడింది. అది పోవడంతో ఆశ కాస్తా చల్లారిపోయింది. ఆయన మంచి వాడే. కాదనను. కాని ఇప్పుడాయనకూ నాకూ ఏమిటి బంధుత్వం ? 'పరాయి యింట్లో పిల్లను ఉంచి చదివించడం ఏమిటి ?' అని ఆలోచించాను. ఇప్పుడు నువ్వింతగా చెబుతున్నావు కాబట్టే నీ యిష్టప్రకారమే కానివ్వు తల్లీ ! అది ఇక్కడ ఉండి ఎందుకూకొరగాకుండా పోతున్నదే అని నాకూ బాధగానే వుంది. కాని నువ్వుకొంచెం పెద్దపిల్లవు...పెద్దచదువులు చదువబోతున్నదానివి. నువ్వక్కడ దాన్ని కాస్త కనిపెట్టి ఉండి, దాని బాగోగులు చూస్తానంటే నాకేమిటి అభ్యంతరం ?''

వంద రూపాయలు అతని చేతిలోనే ఉన్నాయి. కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా ఉండి తర్వాత ఉమవంక తిరిగి ''అమ్మాయిగారు చెప్పినట్టువిని బుద్ధిగా చదువుకుంటావా?' అని అడిగాడు.

ఉమ కళ్లు సంతోషంతో తళతళలాడుతున్నాయి. తండ్రి ప్రశ్నవిని సంభ్రమంతో తల వూపింది.

అతడు చెయ్యిజాపి ఆమె చేతిలో డబ్బు వుంచి ''ఇదుగో ఇంతేవుంది డబ్బు. మామయ్యను మునుపటిలాగా ప్రతీదానికి వేధించక ఈ డబ్బు జాగ్రత్తగా వాడుకో. మళ్లీ ఎప్పుడో చెప్పలేనుగాని నాకురాగానే నేను పంపిస్తాను. ఇప్పుడక్కడ అత్తయ్య లేదు. అది గుర్తు పెట్టుకుని మసులుకో.జాగ్రత్త ఈడబ్బు అమ్మాయిగారి దగ్గర ఉంచు.'' అన్నాడు.

ఉమ డబ్బు నాచేతికి అందించింది. ఆనందంగా అందుకున్నాను. చేసిన ప్రయత్నం ఫలించినందుకు సంతోషంతోనాకళ్లు చెమర్చాయి. అప్పటికప్పుడు ఏమి మాట్లాడాలో తెలియలేదు. కొద్ది క్షణాలు మౌనంగా వుండిపోయాను.

తర్వాత ఒక్క నిముషం ఆగి 'నేను తలపెట్టినపని ఇంత త్వరగా, ఇంత తేలికగా అవుతుందనుకోలేదు. మీరెంతో మంచివారు...' అన్నాను.

అతడు నవ్వి ఊరుకున్నాడు.

నేను లేచి "వొస్తానిక..." అన్నాను.

"వెళ్లిరండమ్మా ! దాన్ని మీతో పంపిస్తున్నాను. దాని మంచీ, చెడూ అన్నీ మీరే చూడాలి..."అన్నాడు. అతని కంఠస్వరం చిత్రంగా ధ్వనించింది.

నేను అడుగు ముందుకు వేయగానే "అమ్మీ! అమ్మా యిగారి వెంట వారి యింటిదాకా వెళ్లిరా..." అన్నాడతడు.

ఉమ నావెంటనే వచ్చింది.

పది అడుగులు వేశామో లేదో ఉమ ఆగిపోయి ఉన్న ట్లుండి నా చేతులు పట్టుకుని నీళ్ల నిండిన కళ్లతో నావంక చూసింది. ఆకళ్ళు కృతజ్ఞతతో తళతళలాడుతున్నాయి.

"అబ్బే పిచ్చిదానా ! ఇందులో నేను చేసిందేముంది..., అన్నాను, ఇంకేమనాలో తోచక.

ఉమ ఏమీ మాట్లాడలేదు. అంతలో నా చేతులు వొదిలిపెట్టి నడవటం ప్రారంభించింది. మేము మా ఇంటికి వొచ్చేసరికి ఆకాశంలో సూర్యబింబం నిస్తేజంగా, మత్తుగా వెలుగుతున్నది. అటువైపునుంచి మబ్బులు కమ్ముకుని వొస్తు న్నాయి. నల్లగా దట్టంగా వున్న మబ్బులు.. యుద్ధానికి తలపడిన సైన్యంలా గర్జిస్తున్న మబ్బులు. ఉండి ఉండి ఆకాశం లో ఒకవైపుకు విద్యుత్తుతో గీత గీసినట్టు కళ్లు మిరిమిట్లు గొలిపేలా మెరుపుతీగ...మేము వరండాలోకూర్చున్నామో లేదో అంతలోనే దడదడమని వర్షం ప్రారంభమైంది.

నెలరోజుల తర్వాత...

కాలేజీ వరండాలో నడుస్తూవుంటే పద్మిని ఎదురై

'ఏకోసం ఎవరో వచ్చారు. రూములో కూర్చోబెట్టి వచ్చాను.' అన్నది. నాకు తెలుసు. ఉమ వచ్చివుంటుంది. స్కూల్‌లో చేరి హాయిగా చదువుకుంటున్నది. శనివారం వస్తే చాలు మధ్యాహ్నం పూట వచ్చేస్తుంది. నాలుగైదు సార్లు అలా వచ్చింది. ...

మావూరి నుంచి రాగానే ముందు స్టేషను నుంచి నేరుగా ఇద్దరం ఉమ మామగారింటికి వెళ్లాము. ఆయన నేనంతకు ముందు ఉమద్వారా, ఉమ తండ్రి ద్వారా విని ఏర్పరచుకున్న అభిప్రాయానికి తగినట్టుగానే వున్నాడు. వాళ్లది చిన్నదైనా చక్కని ముచ్చటైన యిల్లు. అన్నీ క్వార్టర్స్ ఒక్కలాగే వున్నాయి. ఇంటిముందు రకరకాల పూలచెట్లు... చిన్న వరండాలో మనీప్లాంట్ అందంగా అల్లుకుని వుంది.

ఆయన పేరు జగన్నాథం. ఎక్కువ చదువుకోక పోయినప్పటికీ ఏళ్ల తరబడి బాధ్యత కలిగిన ఉద్యోగంలో ఉండడం వల్ల సంక్రమించిన నాగరిక ధోరణి, మంచితనం ఆయనలో కనిపించాయి. ఉమను, నన్ను చూడగానే ఎంత గానో ఆనందించాడు. మేము వచ్చిన పని, మేము సాధించిన ఘనకార్యం విని నిజంగా మురిసిపోయాడు. ఎవరూ లేక కళావిహీనంగా పడివున్న యిల్లు చూడగానే నాకు దిగులు కలిగింది. ఆయన ఉమను తన దగ్గరే ఉంచుకుని చదివి ద్దామని అంతకు ముందు ఎంత తాపత్రయ పడినా వీల్లేక, కాదనిపించుకుని ఊరుకుండిపోయాడేగాని ఉమ అంటే ఆయన కు తగని ఆప్యాయత, అనురాగం...ఉమనేరుగా యింట్లోకి వెళ్లి ఆనందంగా కలియదిరిగింది. బల్ల మీద ఉన్న రేడియో సెట్టును పలకరించింది. తానక్కడ ఉండగా అత్తగారి సాయంతో కుట్టుపని చేసిన అందమైన డోర్‌కర్టెన్ చూపిం చింది. అల్మారులో దాదాపు వందకు పైగా రికార

లున్నాయి. వాటిని నాకు చూపించింది ఉమ.

ఆపిల్లను అక్కడ విడిచి ఆయనకు డబ్బు అందించి వచ్చాను నేను...

...రూములో కుర్చీలో కూర్చుని కూనిరాగం తీస్తూ వ్యరిక తిరగవేస్తున్నది ఉమ. ఆ కూనిరాగం లోనే ఏదో మధురిమ...తీయదనం.

నేను లోపలికి వెళ్తూనే పుస్తకాలు బల్ల మీద గిరవాటు వేసి "నువ్వు సంగీతం నేర్చుకోగూడదూ ఉమా ?" అన్నాను. ఆ పిల్ల అందంగా నవ్వుతూ కుర్చీ పక్కనే ఉన్న ఒక ప్యాకెట్టు అందించింది.

"ఏమిటది ?" అన్నాను దాన్ని అందుకుంటూ.

కొంచెం బిడియ పడుతూ నెమ్మదిగా చెప్పింది. "నిన్న మాస్కూల్లో పాటల పోటీలు జరిగాయి..."

నేనంతలోనే ఆనందంగా "ఫస్టుప్రయిజా ?" అని అడిగాను. తల వూపింది.

ప్యాకెట్టు విప్పి చూస్తే అందమైన చిలకల బొమ్మలున్న గంధపు చెక్క శిల్పం...

"భేష్ ! నువ్వు బాగా పైకి రావాలి. చదువేకాదు. సంగీతంలో కూడా." అంటూ లేచాను నేను.

"నేను స్నానం చేసి వస్తాను. అలా బైటికి పోయి వద్దాం."

ఆ తరువాత పావుగంటలో యిద్దరం రిక్షాలో ఎక్కి బయలు దేరాము. నేను ఆలోచిస్తున్నాను. ఈ పిల్లను బాలకృష్ణ గారికి పరిచయం చేయాలి. ఆయన శిష్యరికంలో ఉమ సంగీత సాధన చెయ్యాలి. శాస్త్రబద్ధంగా సంగీతం నేర్చుకుని పైకి రావాలి. ఆయనను అందుకు ఒప్పించాలి. సాయంకాలం ఆరుగంటల వేళ ఆ యింటి ముందు రిక్షా

దిగాము. "ఎవరి యిల్లిది ?" అంటూనే ఉమ రిక్షా దిగింది
ఆ యింటి పేరు "వీణ".

"చెబుతానుగా..." అంటూ ముందుకు నడిచాను.

ఇంటిముందున్న ఖాళీ స్థలంలో రకరకాల చెట్లు... అంతటా చల్లగా హాయిగా ఉంటుంది. వరండాలో నాలు గైదు కుర్చీలు చిన్న బల్ల ఉన్నాయి.

ఉమను అక్కడే కూర్చోమని నేను లోపలికి వెళ్ళాను. ముందు హాల్లోనే బాలకృష్ణగారి ధర్మపత్ని వనజగారు ఎదు రైంది.

"నమస్కారమండి' అన్నాను.

ఆమె నవ్వుతూ "ఏవమ్మా ! చాలరోజులకు వొచ్చావ్? ఈమధ్య బొత్తిగా నల్లపూసవైపోయావ్..." అన్నది.

"ఏమీ లేదండి...చదువుతోనే సరిపోతున్నది..."

"అంటే ...ఇరవై నాలుగ్గంటలూ చదువుతూనే వున్నావా ? అయితే మంచిదే...కాని కాస్త ఆరోగ్యం సంగతి కూడా చూసుకో...అసలే బలవంతురాలివి..."

ఇద్దరం నవ్వుకున్నాము.

"బాబుగారు లేరా యింట్లో ?"అని అడిగాను.

"లేకేం ? ఉన్నారు...రాత్రేవచ్చారు...నాలుగు రోజుల కిందట బయల్దేరి వెళ్లి మద్రాసు, మరో మూడుచోట్లు తిరిగి వచ్చారు. "

"కచేరీలా ?"

"మరి షికార్లనుకున్నావా ?"

మళ్ళీ నవ్వుకున్నాం ఇద్దరమూ.

అంతలోనే డోర్ కర్టెన్ తప్పించుకుని బాలకృష్ణగారు ముందు హాల్లోకి వచ్చారు. నన్ను చూస్తూనే...

"అబ్బో ! ఇవాళ ఏదో ప్రళయం రాబోతున్న

అన్నాడాయన.

సన్నగా పొడవుగా ఉండే పచ్చని వ్యక్తి. పలుచని అద్దాల కళ్లజోడు. బట్టతల ఇప్పుడిప్పుడే వస్తున్నది. కళ్ళు ఎప్పుడూ అరమూతలై కలలు కంటున్నట్టు ఉంటాయి. అవి పసిపిల్లవాడి కళలు. మతిమరుపు. పరధ్యానం ఎక్కువ.

మా ఎదురుగా మరో కుర్చీలో కూర్చుంటూ చేయి జాపి "ఏదీ? ఏంతెచ్చావు నాకోసం?" అన్నారాయన.

అంతలో గుర్తుకు వచ్చి నాలిక్కరుచుకున్నాను. వాళ్లింటికి ఇంతకు ముందు ఎప్పుడువెళ్లినా పళ్లో ఫలాలో ఏదో ఒకటి తీసుకు వెళ్లేదాన్ని. ఆయన అలా అడగ్గానే గతుక్కు మన్నాను. అంతలోనే నవ్వు వచ్చింది. కాని తమాయించు కుని "ఈసారి భలే కానుక తెచ్చాను" అన్నాను.

'ఏదీ?' అన్నాడాయన అటూ యిటూ చూస్తూ.

నేను లేచి గుమ్మం దగ్గరికి వెళ్లి అక్కడే కుర్చీలో కూర్చుని వున్న ఉమను పిలిచాను. ఆపిల్ల లేచి నావెంట లోపలికి వచ్చింది.

ఆయన ఆశ్చర్యం అభినయిస్తూ "ఇదేం కానుక? ఎవరైనా వింటే నవ్విపోతారు. పైగా మా ఆవిడ ముందు... రామ రామ..."అన్నాడు.

ఉమ బిడియ పడుతూ కూర్చున్నది. వనజగారు ఎదురుగా మరో కుర్చీలో కూర్చుని బుగ్గన నేలుంచుకుని చిరు నవ్వులు చిందిస్తూ చూస్తున్నది.

బాలకృష్ణ గారు కుర్చీలో ముందుకు వంగి కూర్చుని చేతి వ్రేళ్ళు విరుచుకుంటూ ఆపులించాడు. ఆతర్వాత వెనక్కు వాలి నుదురు తుడుచుకుంటూ ఏమీ అంతుపట్టని వాడిలా 'ఊఁ' అనుకున్నాడు.

నేనంతలో నెమ్మదిగా 'ఈ అమ్మాయిపేరు ఉమ...

ఉమాదేవి..మావూరే...పిల్ల నాన్నగారు యుద్ధంలో పనిచేశాడు. ఇప్పుడు మావూర్లోనే వుంటున్నారు. ఇక్కడ ఫోర్తుఫారం చదువుతున్నది. ఉండటం వాళ్ల మామయ్యగారి యింట్లో... చదువులో గొప్ప ఇంటరెస్టు వుంది. నిన్ననే వాళ్ల స్కూల్లో పాటలపోటీలు పెడితే తనుకూడా పాల్గొని ఫస్టు ప్రయిజు సంపాయించింది. చక్కని గంధపు బొమ్మ...ఇందాకే మా హాస్టల్ కు వచ్చింది. వెంటనే సరదాగా ఇటు బయలుదేరి వచ్చాం...'' అంటూ ఉమ వంక తిరిగి 'అన్నట్టు ఉమా ! నువు పోటీలో పాడిన పాట ఏదీ ?'' అని అడిగాను.

ఉమ మరింత సిగ్గుపడిందే గాని జవాబు చెప్పలేదు. వనజగారు 'చెప్పమ్మా...సిగ్గెందుకూ ?' అని హెచ్చరిస్తే నెమ్మదిగా సమాధానం చెప్పింది.

'ఒకసారి పాడి వినిపించు...వింటాం...' అన్నాను నేను.

'ఫరవాలేదు. పాడు...' వనజగారు.

బాలకృష్ణ గారు నవ్వుతూ 'పాడవమ్మా...అట్టే బతి మాలించుకోక...' అన్నాడు.

''మనం తప్ప ఇంక ఇక్కడెవరూ లేరులే. స్కూల్లో అంతమంది ముందు పాడగా లేనిది ఇక్కడ, మాముందు సిగ్గెం దుకు ?'' నేను.

నెమ్మదిగా రాగం ప్రారంభించింది. ఉమ తలవంచు కుని. పాటపాడినంతసేపూ బిడియపడుతూనే కూర్చునివున్నా గొంతు మాత్రం క్రమంగా క్షణాంమీద స్థిరపడింది. ప్రాథ మిక ప్రయత్నం అని తెలుస్తూనే వున్నా గొంతులో మార్దవం, అవసరమైన మెలకువలూ, అందాలు అన్నీ వున్నాయి.

మామిడి తోటలోకి వసంతం రాబోయే సూచనలు కనిపించగానే కొమ్మల్లో రెమ్మల్లో దాగి గొంతు విప్పిన కోయిల గొంతులోని ప్రాథమిక మార్దవం ... కొత్త మావి

పువుళ్ళు రుచి చూసి మొదటి కోయిల మొదటిసారిగా గొంతు విప్పుతున్నట్టున్నది.

మూడు నాలుగు నిముషాల తర్వాత పాట అయి పోయింది. వొళ్ళో చేతులు పెట్టుకుని నేల చూపులు చూస్తు న్నది ఉమ.

బాలకృష్ణగారు ప్రసన్నంగా చూశాడు. ఒక్కక్షణం ఆగి 'నాదగ్గర సంగీతం నేర్చుకుంటావా?' అని అడిగారు.

ఉమ ఆనందంగా తల పైకెత్తి చూసింది. తర్వాత తలవూపింది.

నేను 'అందుకేగా మీ దగ్గరకు వచ్చాను...' అన్నాను.

అలా ఉమ సంగీత సాధనకూడా ప్రారంభమైంది.

ఉమ దాదాపు ప్రతి శనివారమూ ఆదివారమూ మా క్వార్టర్సుకు వచ్చి మాతోనే గడుపుతూ వుండేది.

వచ్చినప్పుడల్లా ఆ అమ్మాయిని కూర్చోబెట్టుకుని పాటలు పాడించుకుని వింటూ వుండేవాళ్లం. మా స్నేహితు రాళ్లల్లో ముఖ్యంగా రోహిణికి సంగీతం అంటే ప్రాణం. ఆ అమ్మాయి ఉమను ఎంతో గౌరవంగా మన్ననతో చూసేది.

కాలం గడిచేకొద్దీ ఉమ కంఠంలో అద్భుతమైన మెలకు వలు అలవడ్డాయి. ఆ అమ్మాయిచేత మొట్టమొదటిసారిగా స్థానిక సంస్థవారొకరు కచేరీ ఏర్పాటు చేశారు.

ఆనాడు నేను ఉమ వెంటనే ఉన్నాను. మాటిమాటికీ 'ఇంతమంది ముందు నేను పాడగలనా?' అని భయపడుతూ వుంటే నేను ధైర్యం చెబుతూ వచ్చాను. ఆమె వేదిక మీదికి వెళ్ళేముందు లేచి నిలబడగానే 'ధైర్యంగా ఉండు. ఏమీ ఫర్వా లేదు. అంతా సజావుగా జరుగుతుంది.' అన్నాను.

ఆమె గురువుగారి పాదాలకు నమస్కరించి వెళ్ళింది.

కొంచెం కొత్తగా భయంగా ప్రారంభించినా పోనుపోను

ఆమె అద్భుతంగా గానం చేసి అందర్నీ దిగ్భ్రాంతులను చేసిం
బాలకృష్ణగారు ఆనందంతో గర్వంతో తలపంకించా
తరువాత కాలం వేగంగా పరుగెత్తింది.
నేను చదువూ, పరీక్షల హడావిడిలో ఉండేదాన్ని.
మేమిద్దరం కలవడం మాట్లాడుకోవడం కొంచెం తగ్గింది. కాని పక్షం రోజుల కొకసారి అయినా కలుస్తూ వుండేవాళ్లం.

తర్వాత నేను పై చదువులకు వెళ్లిపోవలసి వచ్చింది చివరిసారిగా కలుసుకుని చాలసేపు కబుర్లు చెప్పుకుంటూ గ పాము. అప్పటికి ఉమ పొడుగ్గా ఎదిగింది. నల్లని నలుపు అయినా ముఖంలో వింత ఆకర్షణ పెరిగింది. కళ్లు విశా ములై వింతగా ప్రకాశిస్తూండేవి.

అప్పటికి అడపాదడపా కచేరీలు తగలడం ప్రారంభించాయి కొంచెం దూరపు వూళ్లకు కూడా వెళుతూ ఉండేది. అలాంటి సందర్భాలలో ఆమె మావయ్య ఆమె వెంటనే ఉండేవాడు. డబ్బుకూడా సంపాదించడం మొదలైంది.

ఆమె ఎప్పుడూ ఎక్కువ మాట్లాడేది కాదు. తన వ్యక్తిగతమైన విషయాలు ఎన్నడూ చెప్పేదికాదు.

కొన్ని సంవత్సరాలు గడిచాక నేను చదువుకుంటున్న వూళ్లోనే ఆమె కచేరీ చెయ్యడానికి వస్తే కలుసుకున్నాను. అప్పటికి మనిషి బాగా మారిపోయింది.

తలపైన జుట్టు ఒకపక్క తెల్లగా నెరిసింది. కళ్లకు లావుపాటి మందమైన జోడు పెట్టుకుంది. బాగా దగ్గరికి వచ్చి చూసి గాని నన్ను గుర్తు పట్టలేదు. మనిషిలో అకాల వార్ధక్యం ముంచుకొచ్చినట్టు తోచింది.

కాని కచేరీ చేసినంతసేపూ మాత్రం అద్భుతమైన శక్తిని ప్రదర్శించింది. రెండున్నర గంటల సేపు అద్భుత

మైసూర లయవిన్యాస సంగీత ప్రపంచంలోకి [illegible]శాను వెళ్లింది శ్రోతలను తీసుకు వెళ్లింది. కచేరీ అయిపోగానే పరమ నీరసంగా కుర్చీలో కూలబడి పోయింది వగరుస్తూ.

దగ్గరికి వెళ్లి మాట్లాడిస్తే ఆయాసంతో రొప్పుతూ మాట్లాడింది.

'ఏమిటలావున్నావు? ఆరోగ్యం ఎట్లావున్నది?' అని అడిగాను నేను.

తల ఊపిందే గాని సమాధానం ఏమీ చెప్పలేదు.

'మునీర్' అని పిలిచింది. ప్రక్కనే ఉన్న వ్యక్తి ఆమె దగ్గరికి వచ్చాడు.

ఆమె నాతో 'రాత్రి బండికి వెళ్లిపోతాను. మళ్లీ రేపు మద్రాసులో కచేరీ వుంది. మీతో ఎక్కువసేపు గడుపుదామన్నా వీలులేకుండా పోయింది.' అన్నది. ఆ మాటలు మాట్లాడుతున్నంతసేపూ వగరుస్తూ నే వుంది.

'ఇక్కడే ఆగిపోయి విశ్రాంతి తీసుకోరాదూ! బొత్తిగా నీరసంగా వున్నావు. అక్కడికి రాలేకపోతున్నానని వైరిద్దాం.' అన్నాను.

ఆమె 'అలావొద్దు' అన్నది ముందు.

తర్వాత మళ్లీ 'అలా వొద్దు...వారక్కడ ఏదో సంస్థ కోసం డబ్బు కూడా పోగు చేశారు. వెళ్లక పోతే మాట వస్తుంది.' అన్నది.

ఆతర్వాత మళ్లీ 'ఎప్పుడో కలుసుకుందాం... వీలు చూసుకుని వచ్చి మీతో కొంతకాలం ఉండిపోతానుగా...'అన్నది ఆదరంగా కళ్లలో నీళ్లు నిండుతుండగా.

'బాగా బలహీనంగా ఉన్నావు. కచేరీలు తగ్గించుకోవాలన్నావుళ్లు.' అని చెప్పానునేను.

'నాకోసం అయితే అన్నీ మానుకున్నాను. ఇప్పుడు

ఒప్పుకుంటున్నవి బెనిఫిట్ ప్రోగ్రాములు. నాకు ఖర్చులూ కొంచెం డబ్బూ తప్ప ఏమీ రాదు. ఏమీ కోరను కూడా...'

ఆతర్వాత అతని వంకకు తిరిగి 'మునీర్ ! మా చిన్నప్పటి స్నేహితురాలు. నా అక్కగారు. నాలో ఏ కొంచెం గొప్ప ఉన్నా అది ఈమె వల్లనే...ఇక్కడే కాలేజీలో లెక్చరరు, అని పరిచయం చేసింది. నేనతని వంక తిరిగి చేతులు జోడించాను. అతడు నవ్వుతూ నమస్కారం చేశాడు.

ఉమ నన్నయితే అతనికి పరిచయం చేసింది కాని అతన్ని గురించి నాకేమీ చెప్పలేదు.

ఆరోజు రాత్రే వెళ్లిపోయింది.

ఆ తర్వాత సంవత్సరాలు గడిచాయి. ఈలోపల ఆమెను గురించి చాలా విన్నాను. పేపర్లలో చూశాను. ఆమెను గురించి వ్యాసాలు ప్రశంసలు వచ్చాయి. సంగీత జగత్తులో చిరస్థాయిగా నిలిచిపోయే కళాకారిణి అన్న పొగడ్తలు చాలా వచ్చాయి.

లక్షలకొద్దీ రూపాయల నిధులను తన గాత్రం ద్వారా దేశంలో ఎన్నో సంస్థలకు సమకూర్చి పెట్టింది.

నెలరోజుల క్రిందట పేపర్లో చూశాను. ఇప్పుడామె పరిస్థితి ఏమీ బాగులేదని. ఆరోగ్యమూ దెబ్బతిన్నది. డబ్బు లేక ఉన్న కొద్దిపాటి నగలు కూడా అమ్ముకున్నదని చిన్నవార్త.

నా మనసులో కలత రేగింది. 'అసలేం జరిగింది? ఆమె ఎలా ఉన్నది?' అన్న ప్రశ్నలు వేధించాయి. వెంటనే బయలుదేరాను. ఆమె యిచ్చిన చిరునామా చేత బట్టుకుని ఊరంతా వెదికాను. చివరకు అతి ప్రయాస తర్వాత అడ్రసు కనుక్కోగలిగాను.

కాని ఆ యింట్లో లేదామె.

'ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయారు. నెలరోజులవుతుంది

వాళ్ల ఊరికి వెళ్లిపోతానని చెప్పింది. అంతే అని చెప్పారు ఇల్లు గలవారు.

ఊరికి బయలుదేరాను.

* * * * *

# ఉమాదేవి కథనం

వసుంధర !

నాకు జీవితంలో తొలిసారిగా తటస్థపడిన ఒక్కని స్నేహితురాలు !

నన్ను తోడబుట్టిన చెల్లెలుకన్న మిన్నగా ఆదరించింది.

నన్ను బురదలో నుంచి ఉద్ధరించింది !

చీకటిలో నుంచి ఉద్ధరించింది !

అజ్ఞానంలో నుంచి, అవిద్యలో నుంచి ఉద్ధరించింది !

నాచదువు ప్రారంభమైంది.

ఇంటి దగ్గర మామామయ్య నన్ను ఎంతో ఆదరంగా కన్న బిడ్డకన్న మిన్నగా చూసుకునేవాడు.

రోజూ ఉదయమే పనులన్నీ పూర్తి చేసుకుని పుస్తకాల సంచి భుజానికి తగిలించుకుని స్కూలుకు బయలు దేరేదాన్ని. మామయ్య పదిగంటలకు ఇంటికి తాళం వేసి ఫ్యాక్టరీకి బయలు దేరి వెళ్లేవాడు.

అయిదు నిముషాలు నడిస్తే స్కూలు...సాయంకాలం నాలుగు గంటలవరకు స్కూల్లో కాలం గడిచిపోతుంది. చాల ఆనందంగా గడిచిపోయేది. రకరకాల విద్యార్థినులు...

అప్పుడే విచ్చుకుంటున్న అందమైన గులాబీల్లా...కల కల్లాడుతూ...కిలకిలలాడుతూ...రకరకాల అందాల దుస్తులతో వందలాది విద్యార్థినులు...

ఉదయం తొమ్మిదిన్నర కల్లా స్కూలు ఆవరణ అంత నిలువునా పూచినట్టు రంగుల మయంగా ఉండేది.

వరుసగా క్లాసులు...

నెలకొకసారి అయినా ఏదో ఒక కాలక్షేపం...సభలో, సమావేశాలో, వక్తృత్వపోటీలో—క్విజ్‌లో ఏదో ఒకటి జరుగుతుండేవి. నిరంతరం హుషారుగా ఉండేదాన్ని...

పాటలపోటీలో పాల్గొని మొదటి బహుమతి సంపాదించిన నాటినుంచీ నేను టీచర్ల దృష్టిలో పడ్డాను. మా హెడ్ మిస్ట్రెస్ నిర్మలా దేవి నన్ను కనిపించినప్పుడల్లా దయగా ఆపేక్షగా పలుకరిస్తూ వుండేది. మిగిలిన టీచర్లు కూడా ఎంతో అభిమానంగా పలుకరించేవారు.

ప్రతి రోజూ స్కూలు అయిపోగానే నేరుగా యింటి ముఖం పట్టేదాన్ని. నేను ఇల్లు చేరుకునే సరికి మామామయ్య ఫ్యాక్టరీ నుండి తిరిగి వచ్చి ఉండేవాడు. ఒకవేళ ఆయన రావడం ఆలస్యం అయితే వరండాలోనే పచార్లు చేస్తూకాలం గడిపేదాన్ని. అలా పచార్లు చేస్తున్నంత సేపూ కూనిరాగాలు తీస్తూ ఉండేదాన్ని.

సాయంకాలం చీకటి పడేసరికి యింటిపనులు వంటా వార్పూ పూర్తిచేసుకుని తీరికగా కూర్చునేవాళ్లం.

మామామయ్య సంగీతప్రియుడు. చిన్నతనం నుంచీ ఆయనకు సంగీతమంటే తగని ఆసక్తి.

రేడియో కాక యింట్లో గ్రామఫోను ఉంది. ఎన్నో రికార్డులున్నాయి. మామయ్య వాటిని చాల జాగ్రత్తగా పొందికనా దాచి వుంచాడు. వాటిని, ముఖ్యంగా పాత రికార్డులను

ప్రాణప్రదంగా చూసుకునే వాడు. వాటికి నంబర్లు వేసి పదిలంగా ఉంచాడు.

ప్రశాంత రాత్రి వేళలలో...సోమరి సెలవుల మధ్యాహ్న సమయంలో ఇద్దరం తీరికగా కూర్చునేవాళ్ళం.

ఇక ప్రారంభమయ్యేది సంగీత వర్షం...

బడేగులామాలీఖాన్

ఆలీబ్రదర్స్

కుందన్‌లాల్ సైగల్

సి. హెచ్. ఆత్మా

కె. సి. డే

మహమ్మద్ రఫీ

ముకేష్

బాలమురళీ

ఎం. ఎస్. సుబ్బులక్ష్మి

నూర్జహాన్

లతామంగేష్కర్

ఎం. ఎల్. వసంత కుమారి

బాల సరస్వతి

అందరూ అద్భుతంగా గానం చేసేవారు.

రవిశంకర్ సితార్ సమ్మోహనకరంగా సుస్వమనోహరంగా వాతావరణాన్ని అలుముకునేది.

బిస్మిల్లా షహనాయ్ అలలు అలలుగా విజృంభించి మనసులను కలత పరిచి, అలరించి, కళ్ళనీళ్ళు తెప్పించేది.

నీరవ నిశీథులన్నీ చైతన్యం తో ప్రతిధ్వనించేవి. వర్షాకాలపురాత్రులు మృదువుగా నెమ్మదిగా మనోహరంగా గడిచేవి.

నాకు వర్షాకాలమంటే చాలయిష్టం..అందునా రాత్రులు వర్షం కురుస్తూ వుంటే కిటికీ పక్కన కూర్చుని మనో

మోహనంగా వినిపించే సంగీతం వింటూ వుంటే మైమరుపు కలిగేది.

రెండురోజులకొకసారి సాయంకాలం వేళ దాదాపు రెండు మూడుగంటల సేపు బాలకృష్ణగారి యింటిలో సంగీత సాధన. బాలకృష్ణగారు మూర్తీభవించిన పుంభావ సంగీత సర స్వతి. ఆయన మనసు ఎంతో ఆర్ద్రమైనది. సంగీతం ఆయనకు ప్రాణసమానం. రాగం ఆలాపిస్తూ కళ్ళు మూసు కుని స్థాణువులా అయిపోయేవాడు. బాహిర ప్రపంచ స్మృతి ఉండేది కాదు. యోగి వలె సంగీత సముద్రంలో మునిగితేలు తుండే వాడు. వనజ గారికి నేనంటే అవ్యాజ మైన ప్రేమా, వాత్సల్యమూను. నన్ను ఎంతో మన్ననగా చూసేది.

బాలకృష్ణగారు చాలా బిజీగా ఉండేవాడు. పదిరోజు లకు ఒకటి చొప్పున కనీసం ఆయనకు కచేరీలుండేవి. ఒక్కొ క్కప్పుడు దూరదూర ప్రదేశాలకు రాష్ట్రం విడిచి కూడా వెళ్ళి వస్తూ ఉండేవాడు. అడపాదడపా రేడియో కార్య క్రమాలు.

వసుంధరను క్రమం తప్పకుండా వారానికొక సారి కలుసు కుంటూ ఉండేదాన్ని. వాళ్ళ హాస్టలుకు పోతే వారినీ వీరినీ పిలిచి గొప్ప కోలాహలం చేసేది. తన స్నేహితురాళ్ళందర్నీ గదిలో చేర్చి పాటలు పాడమనేది. వారందరూ ఎంతో ఆసక్తితో వింటూ కూర్చునేవారు. నేనక్కడ ఉన్నంత సేపూ సంభా షణలుకూడా సంగీతాన్ని గురించే. నేనీ ఊరికి వచ్చిన రెండు సంవత్సరాలకు అమ్మ హఠాత్తుగా చనిపోయింది. అది తప్ప ఎప్పుడూ నాకేమీ బాధ కలగలేదు.

రోజులు ప్రశాంతంగా, హాయిగా గడుస్తూ ఉండేవి.
ఆరోజు ఆకాశంలో మబ్బులు గుమికూడాయి.
చూస్తూ చూస్తూ ఉండగానే అవి గర్జించాయి.

అంతలోనే ఉరుములు మెరుపులతో జల్లు ప్రారంభ మైంది.

చల్లని వర్షపు గాలి విసురుగా వీచడం మొదలుపెట్టింది.

హాస్టలు రూములో వసుంధరతో ఆమె స్నేహితురాళ్లతో మధ్యాహ్నం నుంచీ వెచ్చగా కూర్చుండి పోయాను. కాలం గడుస్తున్నదే తెలియలేదు.

నవ్వులు...కేరింతలు...పాటలు గొప్ప హడావిడిగా గడిచి పోయింది. తీరా కిటికీలోంచి చూద్దును కదా బయట ఆకాశం నల్లగా భీకర రణరంగంలా తయారై వుంది.

నల్లని మబ్బులు మోహరించి వున్నాయి.

భూమి మీద పగతో గర్జిస్తున్నాట్టున్నాయి.

నల్లని కాటుక కొండలవంటి మబ్బులను చీల్చు కుంటూ కళ్లుమిరు మిట్లు గొలిపేలా మెరుపులు మెరుస్తున్నాయి.

ఆకాశం ఉండి ఉండి యుద్ధానికి సూచనగా గర్జిస్తు న్నాయి. అప్పుడు వెనుదిరిగి 'టైమెంతఅయింది ?' అని అడిగాను నేను.

'పది గంటలు దాటి అయిదు నిముషాలు ' అని సమాధానం ...

'అమ్మో ' ! అనుకున్నాను నేను.

ఇక ఇక్కడి నుంచి బయట పడాలి, తప్పదు'అనుకుంటూ ఇవతలికి వచ్చాను.

వసుంధర ' ఏమిటి ? వెళ్లిపోతావా ? ' అని అడిగింది

నేను తలఊపాను.

ఆమె లేచి వచ్చి కిటికీలోనుంచి చెయ్యి చాపి చూసే 'ఇప్పుడెలా వెళ్తావు ? వర్షం మొదలయింది,' అన్నది.

నాకు గుండెల్లో రాయి పడ్డట్టయింది.

ఇంటికి వెళ్ళాలంటే కనీసం మైలున్నర పైగా నడవాలి.

వర్షం చూద్దామా క్షణక్షణానికి జోరుగా ఎపరీతంగా పెరిగిపోతున్నది.

నామఖంలో దిగులు కనిపెట్టి వసుంధర స్నేహితురాలు మనోహరి నవ్వింది.

'ఒకపని చెయ్యి ఉమా ! రాత్రికి ఇక్కడే ఉండిపో ... హాయిగా మాతోపాటే భోంచేసి వెచ్చగా ఇక్కడే పడుకో తెల్లవారాక ఇంటికి పోవచ్చు,' అన్నది.

'అమ్మో ! మామామయ్య కంగారు పడిపోతాడు. వెళ్లి తీరాలి, అన్నాను నేను.

'సరే అయితే... కొంచెం సేపు ఆగు. ఒక పదినిముషాలు చూసి బయలు దేరుదుగాని... అప్పటికి పై జల్లు కొంచెం తగ్గవచ్చు,' అన్నది వసుంధర.

'వర్షం ఎంతసేపని కురుస్తుందేమిటి ? పదినిముషాలలో తెరిపియివ్వదూ ?' అన్నది పంకజవల్లి,.

'సరే' అని నిట్టూర్చి మళ్లీ మూలబడ్డాను.

గోడకానుకుని చాపమీద కూర్చున్నాను. ఉన్నట్టుండి మనస్సెందుకో బరువెక్కింది!. అకస్మాత్తుగా ఒంటరి తనం నన్ను ఆవరించి నట్టయింది. గుండెల్లో ఏదో దిగులు ... కారణం తెలియకుండానే దిగులు....

ఉన్నట్టుండి కళ్లు మూసుకున్నాను. రూములో ఉన్న నలుగురూ తమలో తాము ఏదో మాట్లాడుకుంటూనే వున్నారు ఉండి ఉండి నవ్వుతున్నారు. కప్పలు వాటి డిసెక్షన్ కల్చెరలు వగైరా మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

అంతలో మగతగా నిద్రముంచుకు వచ్చినట్టు అనిపించింది.

ఎంతసేపు అలా కూర్చునే నిద్రపోయానో తెలియదు. ఉలిక్కి పడి కళ్లు తెరిచే సరికి వసుంధర నన్ను తట్టి లేపుతూ

కనిపించింది.

'ఏవిటలా ఉన్నట్టుండి నిద్రపోయావు ?' అని అడుగుతున్న దామె.

కళ్ళు తుడుచుకుని 'ఏమో! ఉన్నట్టుండి నిద్ర పట్టింది అన్నాను లేస్తూ.

'వర్షం కొంచెం తగ్గింది... లే...కిందికి వెళ్ళి ఏదైనా రిక్షామాట్లాడి నిన్ను పంపించివస్తాను' అన్నది వసుంధర.

'అబ్బే ! ఇప్పుడు రిక్షాఎందుకు ? నడిచే పోతాను' అన్నాను నేను లోపల భయపడుతూనే.

'భలే దానివే. చీకటిలో వర్షంలో అంత దూరం నడిచి పోవడమా ? రిక్షాలోనే వెళ్ళు' అంటూ వసుంధర రూము బైటికి దారితీసింది.

నేనామెను అనుసరించాను.

ఇంక అంతస్థుల మెట్లు దిగుతున్నంతసేపూ మనసులో ఏదో తెలియని వేదన... బాధ.

హాస్టలు ఆవరణ దాటి గేటు దగ్గరికి వచ్చే సరికి వర్షం కొంచెం తగ్గిందే కాని గాలి విసురు తగ్గలేదు.

చల్లని పదునైన గాలి విసురుగా 'రుసరుస' మని సవ్వడి చేస్తూ వీస్తున్నది. ఆవరణలో చెట్లు తలలూపుతూ వింత శబ్దం చేస్తున్నాయి.

దూరంగా రిక్షా కనిపించింది.

వసుంధర కేక వేసి పిల్చింది.

అప్పటికే ఇద్దరం ముద్దగా తడిశాము.

రిక్షా ఎక్కి 'వస్తాను.' ఇంటిదగ్గర మామామయ్య ఎంతగా దిగులు పడుతున్నాడో ఏమో ?' అన్నాను.

వసుంధర చెయ్యి ఊపింది.

రిక్షా రివ్వున కదిలిపోయింది.

రిక్షా నడుస్తున్నంతసేపూ ఇది అని చెప్పరాని బాధ ...మళ్లీ దిగులు ...

ఇంటికి వెళ్లే సరికి మామామయ్య వరండాలో పచార్లు చేస్తూ మాటి, మాటికి వీధిగుమ్మంకేసి చూస్తూ కనిపించాడు.

రిక్షాదిగి లోపలికెళ్ళగానే

"మామయ్యా ! రిక్షా అతనికి డబ్బులిచ్చి పంపించు" అంటూ లోపలికెళ్ళాను.

"అమ్మయ్య ! నువ్వు వచ్చేశావా ? నీకోసం కంగారు పడిపోతున్నాను. చాలాసేపటి నుంచి " అన్నాడాయన తేలికగా నిట్టూరుస్తూ.

నేను లోపలికెళ్ళి జుట్టు తుడుచుకుంటూ ఉండగా లోపలికొచ్చాడు.

గుమ్మంలోనే నిలబడి " అమ్మడూ" అని పిలిచాడు ఆప్యాయంగా.

"ఏం మామయ్యా?" అంటూ వెనుదిరిగి చూచాను.

"ఏంలేదు " అన్నాడాయన.

ఆయన కంఠస్వరం ఎందుకో వింతగా బరువుగా ధ్వనించింది.

అంతలోనే మళ్ళీ,

"ఏంలేదు. వెళ్లి భోంచెయ్యి" అంటూ ముందు గది లోకి వెళ్లి పోయాడు.

ఆకలిగా వుంది. బట్టలు మార్చుకొని వెళ్లి అన్నం వడ్డించు కున్నాను.

ఒక నిముషం తరువాత ఆయన వంట గది గుమ్మంలోకి వచ్చి నించున్నాడు.

నేను తలఎత్తి ఆయన వంక చూశాను.

ఆయన ముఖం గంభీరంగా వుంది.

అంతలోనే గుమ్మంలో కూర్చుండి పోయాడు.

"ఏమిటి మామయ్యా అలా వున్నావు ?" అని అడిగాను నేను.

"ఏం లేదు" అన్నాడు మళ్ళీ.

ఆయన గొంతుకలో ఇందాకటి గాంభీర్యమే ధ్వనించి ఆశ్చర్య పోయాను.

నేను భోజనం చేస్తునంతసేపు ఆయనేమీ మాట్లాడ లేదు. అన్నం ముగించుకొని వంట ఇల్లు సర్ది ముందు గది లోకి వెళ్ళేసరికి మంచం చివర ఏదో దీర్ఘాలోచనలో మునిగిన వాడిలా కూర్చుని వున్నాడు.

నన్ను చూచి ఉన్నట్టుండి "అమ్మడూ ఇలారా" అని పిలిచాడు.

దగ్గరకు వెళ్ళగానే భుజంమీద చేయివేసి పక్కన కూర్చో బెట్టుకొని "మనం తెల్లవారు జామునే ఊరికిపోవాలి" అన్నాడు.

నేను ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసుకొని "ప్రయాణమా ఎక్కడికి మామయ్యా ? అని అడిగాను.

"ఊరికి... మన ఊరికే" అన్నాడాయన.

"ఏం ? అని ప్రశ్నించాను నేను.

ఒక్కక్షణం ఆయనేమి మాట్లాడలేదు. మళ్ళీ అంత లోనే "ఏమీ లేదు మీ నాన్నకు కొద్దిగా సుస్తీ చేసిందట ఇందాకే కబురొచ్చింది నాకు" అన్నాడాయన.

నా గుండెలు జలదరించాయి.

పెద్దగా "ఏమిటి ? ఏమిటి సుస్తీ నాన్నకు ?" అని అడిగాను నేను.

"మామూలు జ్వరమే నువ్వేమీ కంగారుపడకు హాయిగా వెళ్ళి నిదురపో" అన్నాడాయన అనునయంగా నాకు మనసు

నెమ్మదించలేదు.

'చెప్పు మామయ్యా ఏమిటి నాన్నకు సుస్తీ ? ఏం జరిగింది ? ' అని అడిగాను మళ్లీ.

'ఏమీ లేదని చెప్పానుగా ? కంగారు పడకు. పొద్దునే వెళ్ళు తున్నాంకదా ? అంతా తెలుస్తుంది. బాధ పడకు'

నేను వెళ్ళి పడుకున్నాను.

చిన్న నీలం బల్బు మందంగా వెలుగు తున్నది. చాల సేపటి వరకూ ఆయన నిద్ర పట్టక అటూ ఇటూ పొర్లుతూ ఉండటం గమనిస్తూనే వున్నాను.

నామనసు కీడు శంకించింది.

కళ్ళముందు నాన్న రూపం మెదిలింది. యుద్ధంలో గాయపడి అవిటివాడై ఏ పనికి కొరగానుండిపోయిన నాన్న... చిన్నప్పటి నుంచీ నాన్న అంటే చనువు కన్నా భయమే ఎక్కువ నాకు.

వసుంధర నన్ను తీసుకొని మానాన్న తో మాట్లాడటా నికి వచ్చిన సందర్భం గుర్తుకు వచ్చింది.

తరువాత రెండు మూడు సార్లు వెళ్ళినపుడు కూడా నాపట్ల ఎంతో ప్రేమగా, ఆప్యాయంగా ప్రవర్తించాడు. నన్ను చూస్తూనే దగ్గరికి రమ్మని పిలిచి ప్రేమగా అనున యంగా "ఎలా చదువు తున్నావు తల్లీ !? " అని అడిగాడు.

"బాగానే చదువుతున్నాను సంగీతం కూడా నేర్చుకుంటు న్నాను. స్కూల్లో జరిగిన పోటీల్లో మొదటి బహుమతి కూడా వచ్చింది. " అని నేను చెప్పినప్పుడు ఆయన కళ్ళు వింత కాంతితో మెరిశాయి. కళ్ళలో నీళ్ళు ఊరాయి. ఆముఖమే యిప్పుడు గుర్తుకు వస్తున్నది.

కళ్ళ ఎదుట నిలబడి పలకరిస్తున్నట్లు, పిలుస్తున్నట్లు అనిపిస్తున్నది.

లేచి లైటు వేశాను.

మామయ్య గోడవైపుకు తిరిగి పడుకుని వున్నాడు.

బహుశా నిదుర పోతున్నాడేమో !

హఠాత్తుగా బల్ల మీద కృష్ణుడి బొమ్మ కింద చివరలు కనిపిస్తున్న ఎర్రటి కాగితం మీద నాచూపులు పడ్డాయి.

చప్పుడు కాకుండా దాన్ని యివతలకు తీశాను. వొణికే వేళ్ళతో మడతవిప్పి చూచాను. అంతలో నాకాళ్ళు వొణికాయి. నిల్చున్న చోటినుంచి ధబ్బున కిందపడిపోతానేమో నన్న అనుమానంతో గోడ కానుకొని కొన్ని క్షణాలు స్థాణువుగా నిలబడి పోయాను. కళ్ళు నీళ్ళతో నిండాయి.

కాగితాన్ని మళ్ళీ యధాస్థానంలో వుంచేసి నెమ్మదిగా లైటు ఆర్పి వచ్చి పడుకున్నాను. లోపలినుంచి దుఃఖం తెరలు తెరలుగా ఉబికి వస్తున్నది. తమాయించుకోలేక పోయాను. నిశ్శబ్ధంగా ఏడుస్తూ పడుకుండి పోయాను.. చాలా సేపటికిగాని నిద్రపట్టలేదు.

ఆకలత నిద్రలో కల... కలలో నీళ్ళు నిండిన కళ్ళతో నాన్న ముఖం...

బస్సు ఆగింది.

ఊళ్ళోకి వెళ్ళేమైలు దూరం పొడుగునా మామయ్య మాటి మాటికీ " ఏమీ లేదు. కంగారు పడకు. ధైర్యంగావుండు. అన్నిటికీ నేనున్నాను కదా" అంటూనే వున్నాడు.

ఆయన రహస్యం నానుంచి దాస్తున్నాననుకుంటున్నాడు.

ఉన్నట్టుండి నా ముఖంలోకి చూచి " కళ్ళెందు కలా ఉబ్బి వున్నాయి ? పిచ్చి పిల్లా — ఏమీ లేదు కంగారు పడకు" అన్నాడు మళ్ళీ.

నేను ఆయన పడుతున్న అవస్థ మనసులో రేగుతున్న సంఘర్షణను పైకి కనబడకుండా చేసేందుకు ఆయన చేస్తున్న

ప్రయత్నము గమనించి బలవంతాన నవ్వి " ఏమీ లేదు రాత్రి నిద్రపట్ట లేదు" అని సమాధానం చెప్పాను.

ఇంటి ముందు కొచ్చేసరికి వసారాలో ఎవరూ లేరు. వసారాలో పక్కగా మామూలుగా ఎల్లప్పుడూ వుండేమంచమూ, మంచంలో వుండవలసిన నాన్నా ... ఏమీ లేవు.

నాన్న ఎల్లప్పుడూ భుజాల కిందవాడే పోటీ కర్రలు వసారాలో ఒకమూలలో నిలబెట్టి వున్నాయి.

అంతలో దుఃఖం తరంగం ఒకటి పువ్వెత్తున లేచి నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది.

చేతిలో సంచి కిందపడిపోయింది.

ముఖం రెండు చేతులలో కప్పుకొని బావురు మన్నాను, మామయ్య మెల్లిగా నన్ను దగ్గరకు తీసుకొని "ఊరుకో ఏడ వకు — ఉహ తెలిసిన దానివి, మన చేతుల్లో ఏమీ లేదు" అని అనునయించాడు.

పక్క ఇంట్లోనుంచి శాంతయ్య బయటకు వస్తూనే "వ్వా !... వచ్చేశరా ?
నిన్న పగలంతా మీరు వస్తారని ఎదురు చూశాము. సాయం కాలం అయ్యే సరికి మీకు బెల్లిగ్రాం చేరడం ఆలస్యం అయి వుంటుందని అన్నీ ముగించేశాం. ఏం చేస్తాం మరి ? మని షిని ఎంత సేపని అలా ఎదురుగా వుంచుకొని కూర్చో గలం ? పాపం పిల్లకు చూపులైనా దక్క లేదు. అంతే ప్రాప్తం అను కోవాలి " అన్నాడు.

అంతలో ఆయన భార్య ఇవతలికి వచ్చింది. వస్తూనే నా దగ్గరగా నిలబడి జాలిగా " పాపం. వారం రోజుల నుంచీ కొంచెం నలతగా వున్నట్టు కనిపించాడు. రెండు రోజుల క్రితం రాత్రి వేళ మూల్గుతుంటే మావారు వెళ్ళి సంగతేమిటని అడిగితే బదులు చెప్పలేదు. మనిషికి ఎంత అభిమానమో ?

ఎంత బాధైనా ఓర్చుకునే వాడే కానీ పెదవి కదిపే వాడు కాద
మొన్న రాత్రివేళ కొంచెం మూలుగ్గ వినిపించింది. తెల్లవారి
లేచి చూచేసరికి కట్టె మిగిలింది. ''. అన్నది ఆర్ద్రస్వరంతో

''ఇక ఏముందిక్కడ ? పోదాం '' అన్నాడు మామయ్య.

వంగి సంచి చేతిలోకి తీసుకున్నాను. మామయ్య నా భుజం మీద చేయి వేసి ముందుకు నడిపించాడు.

''వెళ్ళొస్తామండీ '' అన్నాడు మామయ్య శాంతయ్యతో ముందుకు నడుస్తూ మంచిది బాబూ అని వినిపించింది. వెనుక నుంచి రోడ్డు మీదకు వచ్చాము. ఐదు నిముషాలలో బస్సు ఎక్కి కూర్చున్న తరువాత మళ్ళీ దుఃఖం పొంగివచ్చింది.

రోజులు ప్రశాంతంగా గడిచాయి ...

బాలక్రిష్ణ గారి దగ్గర సంగీత సాధన సిరా ఘాటంగా నిరంతరాయంగా కొనసాగింది. ఆయన నామీద ప్రత్యేక శ్రద్ధను , ఆసక్తినీ కనబరిచే వాడు.

ప్రతి సాయంత్రం శ్రద్ధగా సాధన చేసేదాన్ని. నేను సాధించే అభివృద్ధిని గమనించి బాలకృష్ణ గారు చాలా సంతోషించేవాడు. ఆమాట పైకి అనేవాడు కూడా.

ఒకనాడు సంగీతం పాఠం ముగించి ఇంటికి వచ్చే సరికి మామయ్య వరండాలో కూర్చొని వున్నాడు. ఆయన ఎదురుగా కుర్చీల్లో మరో ఇద్దరు కొత్త వ్యక్తులు కూర్చొని వున్నారు.

నన్ను చూడగానే మామయ్య ''అదిగో అమ్మాయి వొచ్చేసింది'' అంటూనే నావెనుకనే లోపలి కొచ్చాడు.

పుస్తకాలు బల్ల మీద వుంచి ఆయన వైపు ప్రశ్నార్ధకంగా చూచాను.

ఈడూళ్ళో ఒక సాంస్కృతిక సంస్థ వుందిట. ప్రతి నెలా ప్రోగ్రాములు ఏర్పాటు చేస్తువుంటారట. పోయిన నెలతో

మనం ఎం.యస్. సుబ్బ లక్ష్మి పాట కచేరీకి వెళ్ళ లేదూ ? వాళ్ళే ఈ నెల నెలవారీ ప్రోగ్రాం కింద నీచేత కచేరీ చేయిద్దామని వచ్చారు ".

నాకాశ్చర్యం వేసింది. అంతలోనే భయం కూడా వేసింది. అంత మంది జనం ముందు పాడగలనా నేను ? ఇద్దరమూ వరండాలో కొచ్చాము. నేను వారికి నమస్కరించి కూర్చున్నాను.

వారిలో ఒకాయన "చూడమ్మా మీ హెడ్‌మిస్ట్రెస్ మాటల సందర్భంలో నీపేరు చెప్పింది. బాలకృష్ణ గారు కూడా అదే అన్నారు. పై ఆదివారమే మా ప్రోగ్రాం. నువ్వు సరేనంటే కర పత్రాలు వేయిస్తాము " . అన్నాడు.

నేను భయంగా చూస్తూ "నాకింతకు మునుపు ఇలాటివి అలవాటు లేదు. అంతమంది జనం ముందు పాడగలనా అని నాభయం " . అన్నాను నెమ్మదిగా.

మామయ్య కలుగ చేసుకున్నాడు " పర్వాలేదు లెండి ప్రోగ్రాం ఫిక్స్ అయినట్టే అనుకోండి. అమ్మాయి ఒప్పకున్నట్టే లేండి " .

వాళ్ళిద్దరు లేచారు. నేను మామయ్య వైపు చూచాను. ఆయన కళ్ళతోనే 'ఏమీ మాట్లాడ వద్దన్నట్టు " సైగ చేశాడు.

వాళ్ళిద్దరు శెలవు తీసుకుని వెళ్ళిపోయారు. మామయ్య నాతో నెమ్మదిగా "మొదటి సారి ప్రతివారికీ అలాగే బెరుగ్గా వుంటుంది. తరువాత...తరువాత ఆ బెరుకు పోయి ధైర్యం వస్తుంది. అలవాటైపోతుంది. బహుశా ఎం.ఎస్. సుబ్బ లక్ష్మి కూడా మొట్ట మొదటి సారి కచేరి ఆఫరు వచ్చినప్పుడు నీలాగే భయపడి వుంటుంది. అది ఎవరికైనా తప్పదు ఏదో ఒకరోజు జనం ముందు పాడక తప్పదు. ఇది ఈతకొట్టు

డంలాటిది. ఈత కొట్టేవాడు నీళ్లలో పడక తప్పదు కదా. అలాగే నువ్వూ ఎప్పుడో ఒకప్పుడు జనం ముందు పాడక తప్పదు. అదేదో యిప్పుడే చేస్తే సరిపోతుంది. కంగారు పడకు. అంతా సజావుగా జరిగి పోతుంది' అన్నాడు.

ఆరోజు రానే వచ్చింది. మాగురువుగారు ఈ లోపల ఎంతో ధైర్యం చెప్పి నాకు శక్తి యిచ్చారు.

అది చిన్న హాలే అయినా జనంతో కిటకిటలాడిపోతున్నది. నేను గుండెలు దడదడలాడు తుండగా వేదిక ఎక్కాను. అంత వరకూ వసుంధర కూడా నాప్రక్కనే ఉండి 'ఏమీ ఫర్వాలేదు. విజృంభించు' అని చెబుతూనే వున్నది.

గురువుగారి పాదాలకు నమస్కారం చేసి వేదిక ఎక్కాను కూర్చుని ఎదురుగా తలెత్తి చూడగానే ఆ జనసందోహం కనిపించి నా ధైర్యం సడలి పోయింది. కాళ్లలో నుంచి సన్నగా వొణుకు పుట్టుకు వచ్చింది. అయినా అంతలోనే తమాయించుకున్నాను. గొంతు సవరించుకుని ప్రార్ధన ఆలాపన చేయడం ప్రారంభించాను.

కళ్ళుమూసుకుని అప్పుడప్పుడు మాత్రమే తెరుస్తూ క్రమంగా పాట తర్వాత పాటగా ధైర్యం పుంచుకుని పాడాను. శక్తి అంతా గొంతులోకి తెచ్చుకున్నాను. మిగిలిన నాశరీరం అంతా కరిగి పోయి కేవలం నేను స్వరమే అయినట్టు అనిపించింది.

రెండు గంటలు పైగా కచేరీ సాగింది. ముందువరుసలో ఆసీనులైవున్న సంగీతాభిమానులు అభిమానంతో మెచ్చుకోలు దృష్టితో చూడటం గమనించాను. ప్రక్క వాద్యాల వారు మంచి విద్వాంసులు. ఆరితేరిన వారు. వారు నాకు ఎంతో దోహదం చేశారు. పాట పాటకూ హాలు కరతాళ ధ్వనులతో మారు మ్రోగిపోయింది. నాలో ఆత్మ విశ్వాసం

పెరిగింది.

అంతా అయిపోయిన తర్వాత చప్పట్లు ఆగకుండా రెండు మూడు నిముషాల సేపు మ్రోగాయి. నేను సభకు నమస్కరించి క్రిందికి వచ్చి బాలకృష్ణగారికి నమస్కరించాను. ఆయన నన్ను లేవనెత్తి నీటి పొర నిండిన కళ్ళతో నిశ్శబ్దంగా అభినందించారు.

వసుంధర, స్నేహితురాళ్ళు పొంగిపోతూ ఎంతగానో అభినందించారు. ఇక మామావయ్య... కళ్ల నిండా నీళ్ళు క్రమ్ముకు రాగా నన్ను కౌగలించుకుని ఆనందించాడు. 'నా కలలు పండించావు అమ్మడూ' అన్నాడు.

కాలం గడిచే కొద్దీ కార్యక్రమాల రద్దీ పెరిగిపోవడం మొదలైంది.

ఇతర వూళ్ల నుంచీ, దూరపు ఊళ్ల నుంచీ ఆహ్వానాలు రాసాగాయి.

చదువు వెనకబడింది. స్కూల్ ఫైనలుతో చదువు ఆపేశాను.

కచేరికి వెళ్ళినప్పుడల్లా రొఖ్ఖం యిచ్చేవారు. ప్రయాణ ఖర్చులు భరించేవారు.

మా మావయ్య నేనెక్కడికి వెళ్లినా నాతోనే వచ్చేవాడు. ఆయన ఉద్యోగంలో నుంచి తనకుతానుగా రిటైరయి పోయాడు.

పెద్దలతో కొత్తవ్యక్తులతో పరిచయాలు ఏర్పడ్డాయి. కొత్త కొత్త ప్రదేశాలలో పెద్ద పెద్ద సంగీత విద్వాంసులతో పరిచయం, వారి సరసన కచేరీ చేయడంలో నామీద నాకు విశ్వాసం ఏర్పడింది. ఆ విశ్వాసంతో పాటుగా నేర్చుకోవలసింది ఇంకా ఎంతో ఉన్నదనీ సాధించవలసింది ఇంకా ఎంతో ఉందనీ వినయ భావంకూడా ఏర్పడింది.

సంగీత సముద్రాన్ని మథించి ఆణిముత్యాలను సాధించిన దిగ్దంతుల వంటి మహా పండితులు నా గానం విని అభినందన సూచకంగా తలలు ఊపినపుడు 'షేష్' అన్నప్పుడు కించిత్తు గర్వం కలిగేది కూడా.

ఆనాడు నాపుట్టిన రోజు. ఇరవై అయిదేళ్లు వెళ్లి ఇరవై ఆరో సంవత్సరం ప్రవేశించింది. ఏకార్యక్రమమూ లేకుండా ప్రశాంతంగా ఇంటిదగ్గరే ఉన్నాను.

పొద్దున్నే తలస్నానం చేశాను. మధ్యాహ్నం రెండు గంటల వేళ జుట్టు చిక్కు తీసుకుంటూ అద్దం ముందు నిల బడి నావంక నేను శ్రద్ధగా చూసుకున్నాను. ఇన్నాళ్లు గమ నించలేదు కాని చెంపల పైగా జుట్టు ఒక పాయగా తెల్లబడింది. కళ్ల కింద చర్మం జారినట్టుగా ఉంది. ముఖం అద్దానికి దగ్గరగా పెట్టి జాగ్రత్తగా చూశాను. కళ్ల క్రింద సన్నని ముడతలు ఏర్పడ్డాయని అనిపించింది.

మామయ్య పక్కగదిలో దగ్గుతున్నాడు. ఆయనకు ఈ మధ్య ఆరోగ్యం ఏమీ బాగుండటం లేదు. నిరంతర జ్వరం దగ్గూ ఆయాసమూ వస్తున్నాయి.

నేను లోపలికి వెళ్లి ఆయన వంక చూశాను. మనిషి బాగా వడిలి పోయి కృశించిపోయి సలిగినట్టుగా ఉన్నాడు.

ఆయన దగ్గరగా వెళ్లి 'డాక్టరు దగ్గరికి వెళ్దాం మామయ్యా! నీ ఆరోగ్యం ఏమీ బాగున్నట్టు లేదు' అన్నాను.

ఆయన అప్పుడు ఫోటోల ఆల్బం చూస్తున్నాడు. పెద్ద ఆల్బం. దానిలో ఎన్నో ఫోటోలు. నేను వివిధ ప్రదేశాలలో కచేరీలు చేస్తుండగా తీసినవి.

ఆయన కళ్లెత్తి చూశాడు. ఆకళ్లలో కొంచెంగా గర్వ రేఖ మెరిసి మాయమైంది.

అంతలోనే ఆయన 'ఏమీలేదు, ఊరికే జలుబు చేసి దగ్గు

వస్తున్నది. అంతే వేరే జబ్బేమీ లేదులే' అన్నాడు.

తర్వాత కొద్ది క్షణాలాగి నన్ను దగ్గరికి పిలిచి 'నేనేమైనా ఫరవాలేదు. నిన్నింత దాన్ని చేశాను. ఆ తృప్తిచాలు. కాకపోతే ఇతర ఏఆడదిక్కూ లేని వాణ్ణి. నీ గురించి ఇన్నాళ్ళు ఏమీ పట్టించుకోలేదు. నాకు చెప్పేవాళ్ళు లేరు. కాస్త తొందరలో నిన్నొక అయ్య చేతిలో పెట్టి....' అంటున్నాడు.

నేను 'ఊరుకో మామయ్యా' అంటూ ఇవతలికి వచ్చేశాను. ఈయనకు ఈ మధ్య నాపెళ్ళి పిచ్చి పట్టుకుంది. అయినా భ్రమకాని నన్నెవరు పెళ్ళాడతారు ? నాఅందం చూసి పారిపోతారు. పైగా ఈమధ్య బాగా లావయిపోతున్నాను కూడా.

ఈ శంకర్ మనిషి చాలా మంచివాడు. గొప్ప సంగీతాభిమాని. నేను ఎదురుగా ఉంటే చాలు బ్రహ్మలోకాల్లో తేలిపోతున్నట్టు ఉంటాడు. నన్ను విపరీతంగా పొగుడుతూ ఉంటాడెప్పుడూ.

'నువ్వు గంధర్వ జాతికి చెందిన దానివి '

'నీ కంఠ స్వరంలో వేయి వీణలు మ్రోగుతాయి.' ఇలాటి పొగడ్తలు విన్నప్పుడు నన్ను నేను మరిచి పోయేదాన్ని.

అంతకు ముందు ఎందరో ఇలాటి ప్రశంసలు పలికారు కాని శంకర్ నోటివెంట అలాటి పొగడ్తలు వస్తే వాటు మనసుకు రెక్కలు వచ్చినట్టయ్యేది. రంగు రంగు పూలతో విలువెల్లా పూచిన చెట్లలో రమణీయమైన అందాల నందనోద్యానవనంలో విహరించినట్టు శుభ్ర హిమాలయాలలో విరుగాముతున్నట్టు, రంగు రంగుల ఇంద్రధనస్సు పైన విశ్రాంతిగా కూర్చున్నట్టు అనిపించేది.

శంకర్ పొడవుగా దృఢంగా ఉంటాడు. పచ్చని శరీరచ్ఛాయ. బలమైన శరీరం. కొనదేలిన ముక్కు. నిరంతరం నుదుటిమీద పడే జుట్టు. నిర్లక్ష్య వైఖరి. మాట

కారి తనం అన్నీ నన్ను విపరీతంగా ఆకర్షించాయి. అతనిసన్ని ధిలో ఉండాలనీ, అతని సమక్షంలోనే గానం చేయాలని అనిపించేది.

అతనికీ నాకూ మధ్య పరిచయమై ఎంతో కాలం కాలేదు. రెండుమూడు నెలల క్రిందట రైల్లో ప్రయాణం చేస్తుండగా పరిచయమైనాడు. నా ఎదురుగా సీటులో కూర్చుని వుండి చాలా సేపు ఏదో చదువుకుంటూ కాలంగడి పాడు. నావంక శ్రద్ధగా చూడనైనా లేదు. పుస్తకం చద వడం ముగించి దాన్ని పక్కన పడేసి వొళ్ళు విరుచుకున్నాడు. తర్వాత చేతివ్రేళ్ళు విరుచుకున్నాడు. అంతలో అతని చూపు లు నామీద పడ్డాయి. 'ఎక్కడ చూశానా' అని కాబోలు కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డట్టు కనిపించాడు.

ఆ తర్వాత ముందుకు వంగి 'మీపేరు ఉషాదేవి కదూ?, అని అడిగాడు పరమ మర్యాదగా.

నేను తల వూపివూరుకున్నాను.

ఇక అతడు మాట్లాడటం ప్రారంభమైంది. మొదటి పరిచయం తోనే విపరీతంగా మాట్లాడాడు. నాకచేరీ రెండు సార్లు విన్నాడట. రేడియోలో కూడా చాలా సార్లు విన్నాడట. ఇక ప్రయాణం కొనసాగినంతసేపూ సంగీతం గురించే మాట్లాడాడు. తన అభిమాన గాయకులు, వారి ప్రసిద్ధ కీర్తనలు, సంగీత దర్శకులు వారి ప్రసిద్ధ మైన పాటలు. ఇదీ దోరణి. బడేగులామాలీఖాన్ మొదలుకుని సచిన్ దేవ్ బర్మన్ వరకు ప్రముఖుల పేర్లు దొర్లిపోయాయి. అతని దగ్గర ఎన్నో పాత రికార్డులు అతి విలువైనవి ఉన్నాయి. ఆ వయసులో అంత సంగీతాభిమానం ఉండటం అందునా నిరంతరం బిజీగా ఉండే ఒక ఆఫీసరు హోదాలోవ్యక్తికి అంత సంగీతాభిరుచి ఉండటం నాకు ఆశ్చర్యం కలిగించింది.

'మీరు సంగీతం సాధన చేశారా ? ' అని అడిగాను.

అతడా ప్రశ్నవిని పెద్దగా నవ్వాడు.

నవ్వి నవ్వి ' సంగీతమా ? నాకు గావడమా ? జనం అదృష్టవంతులు... నేనే పాడటం ప్రారంభిస్తే ఎన్ని యాక్సిడెంటులు జరుగుతాయో ' అన్నాడు.

ఆతర్వాత ' మనం ఒక ఊర్లోనే వుంటూ ఇంతవరకూ కలుసుకోక పోవడం అన్యాయం. నాలాటి అభిమాని, గట్టి ఫ్యాన్ ఒకటుండటం మీరు గర్వించ వలసిన విషయం' అన్నాడు.

ఆ తర్వాత తరుచుగా మాయింటికి వస్తూ పోతూ ఉండే వాడు. మామయ్యతో కూడా చనువుగా స్నేహంగా ప్రవర్తిస్తూ వుండేవాడు. మేమిద్దరం కలసి అప్పుడప్పుడు షికారుకు కూడా బైటకి వెడుతూ ఉండేవాళ్లం. అది మామయ్యకు తెలుసు కూడా. అయినా ఆయన నన్ను వారించ లేదు. వయస్సులో ఉన్న ఆడపిల్ల అలా పరాయి యువకుడి వెంట బైట తిరగరాదని నాకూ తోచలేదు. అతడు నాకెంతో ఆప్తుడుగా కావలసిన వాడుగా అనిపించేది.

అతని వెంట, అతని పక్కన, నడుస్తున్నప్పుడు ఏపార్కులోనో అతని పక్కన కూర్చున్నప్పుడు చూస్తే ఇతరులు ఏమనుకుంటారో నేనెప్పుడూ ఆలోచించనే లేదు.

అతడు అందమైన వాడు.

నేను నల్లగా వికృతంగా ఉంటాను.

చూసేవారికి రకరకాల ఊహలు రావచ్చు. కాని నేనా విషయం ఎన్నడూ ఆలోచించలేదు.

ఒక్కసారి మాత్రం మేము పేవ్‌మెంట్ మీద నడుస్తూ వుంటే ఎవరో జులాయి, వదరుబోతు, ఉన్నట్టుండి వికృతంగా నవ్వుతూ 'ఆహా' ! ఏమి జంటరా బాబూ! కన్నుల పండుగ్గా

ఉంది' అన్నాడు పక్క వాడితో.

ఒక్కసారి నావీపున కొరడాతో చరిచినట్టయింది. దీని అర్థం నాకు తెలుసు. అకస్మాత్తుగా నీరసం ఆవహించింది. నా పక్కనే ఏదో మాట్లాడుతూ నడుస్తున్న శంకర్ వంక చూశాను. అతడది ఏమీ వినలేదు, కాబోలు తన ధోరణిలో తాను మాట్లాడుతూ నడిచి పోతున్నాడు.. అకస్మాత్తుగా ఆగి రెండడుగులు వెనక బడిన నన్ను ఆశ్చర్యంతో చూస్తూ 'ఏం ? ఆగిపోయారలా?' అని అడిగాడు. 'ఏమీ లేదు ' 'అంటూ ముందుకు అడుగులు వేశాను.

ఇవాళ నా పుట్టిన రోజు. చాలా హాయిగా గడప వల రోజు. లోపల మామయ్య మళ్లీ దగ్గుతున్నాడు.

నేను లోపలికి వెళ్లాను. మామయ్య నావంక తలెత్తి చూశాడు.

''మామయ్యా, శంకర్ వస్తానన్నాడు సాయంకాలం '' అని చెప్పాను.

ఆయన మెల్లిగా తల పంకించాడు. శంకర్ వస్తాడని విని ఆయన కొంచెం ఆనందించడం నేను గమనించాను.

మళ్లీ ఇవతలి గదిలోకి వచ్చాను.

శంకర్ వస్తాడు ! నాలో ఉత్కంఠ బయలుదేరింది.

నిన్ననే ...సాయంకాలం...జరిగిన ఉదంతం గుర్తుకు తెచ్చుకున్నాను. సాయంకాలం శంకర్ వచ్చాడు. నాలుగు గంటలవేళ... వూళ్లోనే నిన్న నాకచేరీ...ఏదో అనాథ శరణాలయంలోని బాలబాలికల సహాయార్థమై ఏర్పాటయిన కార్యక్రమం. ఆ శరణాలయాధికారుల చాలా రోజులక్రితమే నా దగ్గరికి వచ్చి బలిమాలే ధోరణిలో అర్థించారు. 'దాదాపు నూరు మంది పిల్లలున్నారు శరణాలయంలో. ఫండ్స్ లేవు. అందరూ తల్లీతండ్రీ ఏ యితర దిక్కూ లేని దీనులైన బాలబాలికలు. వారికి

చదువు వృత్తివిద్యలు కుట్టుపని వగైరాలు నేర్పుతున్నాం... ప్రభుత్వం నుంచి సహాయం లేదు. మీరు సహకరిస్తే దయ చేసి ఒక్క పాటకచేరీచేస్తే ఒడ్డున పడిపోతాం. టిక్కెట్లమీ డబ్బు వసూలు చేస్తాం.' అని అర్థించారు. వారికి శంకర్ ప్రోద్బలం యిచ్చి పంపించాడని మాటల సందర్భంలో తెలిసింది. కాకపోయినా అలాటి సందర్భాలలో నేను వెనుకాడను. కాదనను. అంతకుముందు ఎన్నోసార్లు ఎన్నో ధర్మకార్యాలకు, స్వచ్ఛంద సేవా సంస్థలకు చాల పెద్ద మొత్తాలే వసూలయ్యాయి. నా కచేరీ ఒక ప్రేరకంగా పనిచేస్తుంది. అంతే.

కచేరీ అయిపోయిన తర్వాత మంచిపనికి సహాయం చేసి నందుకు నన్ను మామూలుగానే అందరూ అభినందించారు. పాతికవేల రూపాయలు వసూలయినట్లు చెప్పారు. అనాథ శరణాలయానికి ఆమొత్తం ఎంతగానో ఉపయోగ పడుతుందని ఆసాయం చేసినందుకు కృతజ్ఞులమని చెప్పారు. నేను మౌనంగా ఉండిపోయాను.

తిరిగి వచ్చేముందు శంకర్ 'మిమ్మల్ని ఇంటి దగ్గర దిగబెడతాను.' అన్నాడు.

'మీ రూము దగ్గరేకదా? నేను రిక్షాలో పోతాను' అని అన్నాను.

అతడు వినలేదు. 'మీ మామయ్యగారు కూడా లేరు. నేను తోడుగా వస్తాను.' అన్నాడు.

రాత్రి పదిగంటలు దాటింది. వీధులలో రద్దీలేదు. లైట్లు మందంగా వెలుగుతున్నాయి. చలికాలపు రాత్రి కావడంతో ముందుగానే ఊరంతా మాటుమణిగినట్లున్నది. పలుచని మంచుతెరలు ప్రేలాడదీసినట్టుగా ఉంది. లైట్ల చుట్టూ పలుచని తేజోవలయం. అందులోకి అసంఖ్యాకంగా మూగి ఎగురుతున్న లెక్కలేనన్ని సన్నని రెక్కల పురుగులు.

నేను శాలువా చెవులచుట్టూ లాక్కుని నడుస్తున్నాను. శంకర్ నాపక్కనే నడుస్తున్నాడు. అతడలా ఎల్లప్పుడూ నా చెంతనే, నాపక్కనే ఉంటే? ఆ ఊహ ఎంతో అద్భుతం అనిపించింది. ఉద్వేగంతో తలముక్కలైనట్టుయింది.

ఉన్నట్టుండి శంకర్ నావంక తిరిగి, నడుస్తున్నవాడల్లా ఆగి, 'థాంక్స్ ఉమా! నేనే వాళ్లను మీ దగ్గరికి పంపించాను. నువ్విలాటి సంస్థలకెన్నింటికో సహాయం చేసి లక్షలాది రూపాయలు ఆర్జించిపెట్టావని తెలుసు. ఈ మనుషులు ఆ శరణాలయాన్ని నిర్వహించలేకమూసేద్దామని నిర్ణయించుకున్నారు. అంటే వందమంది బాలబాలికలు — అందరూ పదహారేళ్ల లోపువారే — రోడ్లమీద పడిపోతారు. దిక్కూ దివాణమూ లేని అనాథ పక్షులై పోతారు. ఆ ఆలోచననే నేను సహించలేకపోయాను. ఈ ఉపాయం సూచించాను. వాళ్లు మొదట నువ్వు ఒప్పుకోవేమో అని సందేహించారు. నేను గట్టిగా చెప్పాను. 'ఆవిడ మనసు మహామంచిది. బంగారంలాటిది. వెళ్లి అడగండి. ఒప్పుకుంటుంది.' అన్నాను. నామాట దక్కించావు. థాంక్స్'' అన్నాడు.

నేను నెమ్మదిగా నడుస్తూనే అంతా విన్నాను. అంతలో నాలో ఏదో భావం తళుక్కుమని మెరిసినట్టుయింది. హృదయపు అగాధాలలో ఎక్కడో దాగిన భావం ప్రాణం పోసుకుని ఉపరితలానికి వచ్చినట్టుయింది.

శంకర్ ఇంటి ముందుకు వచ్చాము. ఇల్లంటే యిల్లు కాదు. ఒక రెండురూముల భాగం.

ఆయింటి ముందు ఆగిపోయాను. శంకర్ 'ఏం! ఆగారేం?' అని ప్రశ్నించాడు.

'కాస్సేపు మీ యింట్లో కూర్చుందాము. నెమ్మదిగా తర్వాత వెళ్తాను.'

శంకర్ తల వూపి 'అలాగే ! కాని టైము చాల అయి నట్టుంది. మీ మామయ్య కంగారు పడతారేమో!' అంటూనే తాళం తీశాడు.

తాళం తీస్తూనే 'ఏమి జీవితమో! బోర్ కొడుతున్నది. హోటల్ భోజనం...రూము నిద్ర...' అన్నాడు చప్పరించి.

'అవును. ఒంటరితనం భరించలేము. ఈ వయసులో శారీరకంగా మానసికంగా తోడుకావాలి. లేకపోతే జీవితం నరక ప్రాయం అవుతుంది.' అనుకున్నానునేనులోలోపల.

ఇద్దరం లోపలికి వెళ్లి సోఫాల్లో కూర్చున్నాము. శంకర్ కూర్చుంటూ 'ఇంట్లో ఏమీ లేవు...కాస్తకాఫీ నీళ్ళు యిద్దామన్నా...' అన్నాడు.

'ఏమీ వొద్దు' అన్నాను.

ఆతర్వాత ఏం మాట్లాడాలో తోచక ఎలా మాట్లాడాలో తోచక గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాను.

శంకర్ లేచి గ్రామఫోను రికార్డులు వెదుకు తున్నాడు.

'ఇప్పుడేమీ వద్దు...ప్రశాంతంగా కూర్చుందాం' అన్నాను.

అతడు కొంచెం ఆశ్చర్యపోయి 'సరే' అని వచ్చి నాముందు సోఫాలో కూర్చుని 'ఏమిటో సీరియస్‌గా ఆలోచిస్తు న్నారే !' అని అడిగాడు.

'అవును. ఆలోచిస్తున్నాను నేను మిమ్మల్నొక విషయం అడగాలను కొంటున్నాను. ఎలా అడగాలో అని ఆలోచిస్తున్నాను. అన్నాను.

అతడు తల ఎగరవేసి'అబ్బో ! అయితే అదేదో చాలా సీరియస్ విషయమై వుండాలి...' అన్నాడు.

'అవును. అంతముఖ్య విషయమే...నా జీవితాన్ని గురించి...'

అతడు సోఫాలో వెనక్కు వాలాడు.

'జీవితమూ వగైరా సీరియస్ విషయాలు వినడం కొంచెం కష్టమేనే' అన్నాడు నవ్వుతూ.

'ప్లీజ్...శంకర్...నామాట వినండి...నేను చెప్పదలు చుకున్నది విని తర్వాత జోక్స్ వేయుండి.

అతడు గంభీరంగా కూర్చుండిపోయాడు. నావంకే నిశితంగా చూస్తూ.

నేను తలవంచుకుని మెల్లిగా చెప్పాను.

'రేపు నా పుట్టినరోజు. ఇరవై అయిదేళ్ళు వెళ్ళి ఇరవై ఆరో ఏడు వస్తుంది. కొంచెం చదువుకున్నాను.... సంగీతంలో ఏలాటి అభిమానుల వల్ల ఈ అంతస్థుకి చేరుకో గలిగాను. డబ్బు బాధలు ఏమీ లేవు. మామయ్య నన్ను ఎంతో ప్రేమగా పెంచి పెద్దదాన్ని చేశాడు. ఆయనకు నేను కన్న కూతురు కన్నా ఎక్కువ. ఆయుకున్న సర్వస్వం నేను. ఆయిల్లు కొంత డబ్బు ఉన్నాయి ఆయనకు. తల్లీ తండ్రీ ఎవరూ లేరు నాకు. అందరూ పోయారు. మామయ్య పెద్దవాడైపోతున్నాడు. ఆయనకు నన్ను గురించి దిగులు. పైకి కనిపించకుండా ఆయన నాగురించి దిగు లుతో లోలోపల క్రుంగిపోతున్నాడు. శిధిలమైపోతు న్నాడు...ఆయన కేదన్నా అయితే ...' అంటూ ఉండగా నాకు ఏడుపు వచ్చింది. చేతులలో మొహం దాచుకుని ఏడ్చాను.

శంకర్ నిర్విణ్ణుడైపోయాడు.

కంగారుపడుతూ 'అదేమిటి ఉమా ! ఎందుకు ఏడుపు ? ఊరుకో' అన్నాడు లేస్తూ.

నేను అంతలో తేరుకుని 'ఫరవాలేదు...' అన్నాను.

మళ్ళీ వేతిగోళ్ళవంక చూసుకుంటూ నెమ్మదిగా 'ఆయన కేమైనా అయితే నేను ఒంటరి దాన్నయిపోతాను.

దిక్కులేనిదాన్నయి పోతాను...' అన్నాను.

శంకర్ తెల్లబోయిన వాడిలా 'అదేమిటి? అలా ఏమీ జరగదు. పైగా మేమందరమూ లేమా ఏమిటీ?' అన్నాడు.

'మేమందరమూ అంటే ?'

'నేనూ...ఇంకా నాలాటివారూ...'

'నాక్కావలసింది సహాయ సానుభూతులు స్నేహం కాదు. నా జీవితంలో పాలుపంచుకునే వ్యక్తి కావాలి. నన్ను అభిమానించి తోడునీడగా ఉండే వ్యక్తి కావాలి !'

'అయితే పెళ్లి చేసుకుంటే సరి...' అన్నాడు హఠాత్తుగా శంకర్.

నేను ధైర్యంగా తలెత్తాను.

'అదే... అవును...నేను పెళ్లి చేసుకోవాలి...'

అతడు హాయిగా నవ్వుతూ 'చేసుకోండి...దానిదేముంది అద్భుతంగా చేసుకోవచ్చు...' అన్నాడు.

'తమాషాలు కాదు. నన్నెవరు చేసుకుంటారు ?'

అతడు మళ్లీ నవ్వాడు.

'మీకేం తక్కువ ? అందమైన మనసువుంది. అద్భుతమైన విద్య ఉంది. పేరు ప్రఖ్యాతులున్నాయి.'

'అందుకే మిమ్మల్ని అడుగుతున్నాను. మీరేమంటారు ?'

అతడు తెల్లబోయాడు "అంటే...అంటే...'అన్నాడు నోటిమాటరాక.

"నేనడుగుతున్నది అదే...మిమ్మల్ని అడుగుతున్నాను.'

అతడు నాదగ్గరగా వచ్చాడు. అకస్మాత్తుగా నాగడ్డాన్ని మునివేళ్లతో పైకెత్తి నాకళ్లలోకి చూశాడు.

రెండుక్షణాలాగి నిట్టూర్చి 'ఉమా ! ఎంత ఆనందంగా

ఉందో చెప్పలేను. నీలాటి అపర సంగీత సరస్వతి ఇలా అడుగుతుంటే గర్వం తలకెక్కుతున్నది. ఒహ్! నాఅంతటి వాడుండడు. నువ్వు నా హృదయంలో పలికే కోయిలవు' అన్నాడు.

తర్వాత చేతులు వెనుక కట్టుకుని రెండు నిముషాలసేపు అటూ యిటూ పచార్లు చేశాడు.

ఆతర్వాత ఆగి 'రేపు నీ పుట్టిన రోజుకదూ ? రేపు సాయంకాలం నాలుగున్నరకు మీ యింటికి వస్తాను. నిన్ను సర్ప్రయిజ్ చేస్తాను !' అన్నాడు.

తర్వాత 'లే పోదాం ! చాల పొద్దుపోయింది.' అన్నాడు.

నేను లేచాను. ఆ తర్వాత అతడు నాపక్కనే అంత దూరమూ నడిచాడు. హుషారుగానడిచాడు. ఉండి ఉండి కూనిరాగాలు తీశాడు. ఈలలువేశాడు. నన్ను యింటి దగ్గర దింపి 'లోపలికి రాకూడదా ?' అంటే 'ఇప్పుడు కాదులే ! రేపు సాయంకాలం...' అని బదులు చెప్పాడు.

ఆ పలుచని మంచుతెరలు కమ్మిన నీరవ నిశీధిలో నిర్మానుష్యమైన మాయింటి ముందు ఇద్దరమూ ఒకనిమిషం నిలబడ్డాము. అంతసేపూ యిద్దరమూ ఏమీ మాట్లాడ లేదు. నిశ్శబ్దంగా నిలబడిపోయాము. క్రీక్‌మని ఏదో పక్షి అరుస్తూ మా తలల మీదుగా ఎగిరి పోతూవుంటే ఉలిక్కిపడి పైకి చూశాము.

అ తడంతలో 'గుడ్‌నైట్' అంటూ వెళ్లిపోయాడు. ఒక్కసారి దగ్గరికి తీసుకుని నన్ను గుండెలకు హత్తుకుని చిన ముద్దుపెట్టి వెడితే ఎంత బాగుండేది ! అనిపించింది.

రాత్రి అంతా కలలే...నిద్రపట్టలేదు... కాలం మరీ బలిసిన సోమరి కొండచిలువలా మెల్లగా కదులుతున్నది.

నేను జడవేసుకుని మొహం కడుక్కుని తయారై

కూర్చున్నాను. ఏమీ తోచలేదు. బల్లమీద అలారం గడి యారం మూడుగంటలే చూపిస్తున్నది. మామయ్య గదిలో నుంచి అలికిడి ఏమీ లేదు. ఆయన బహుశా నిద్రపోతున్నా డేమో !

అంతలో గుమ్మం దగ్గర అలికిడి అయింది.

'ఎవరిది ?' అంటూ లేచి వెళ్ళాను.

మునీర్ నిలబడి వున్నాడు.

'ఏమిటి ?' అన్నట్టు చూశాను.

'పొద్దున్న చెప్పింది మరిచిపోయారా !? ఎవరో గెస్టు లొస్తారని పళ్ళూ స్వీట్‌లూ తెమ్మన్నారుగా...'అన్నాడు మునీర్.

నేను 'అవునవును' అంటూ పక్కకు తొలిగి నిలబడి 'రా లోపలికి రా...' అన్నాను.

మునీర్ లోపలికి వచ్చాడు. సంచీలో నుంచి బిస్కట్ పొట్లాం ఇవతలికి తీసి టీపాయ్ మీద ఉంచాడు.

చివరకు ఒక చిన్న తామరాకు పొట్లాం అనుమానిస్తూ సంశయిస్తూ ఇవతలికి తీశాడు.

నేను 'అదేమిటీ ?' అని అడిగాను.

'ఇవి పూలండీ...గులాబీ పూలు' అంటూ తడబడ్డాడు మునీర్. తర్వాత నా కళ్ళలోకి భయంభయంగా చూస్తూ 'వాస్తూ వుంటే బజార్లో కనిపించాయండి...ఇవాళ మీ పుట్టిన రోజుకదా ! అని తెచ్చాను...' అన్నాడు.

నేను నవ్వి 'నాకు పుట్టినరోజు కానుకగా తెచ్చావా ? వెరీగుడ్. అక్కడ పెట్టు.' అన్నాను.

అతడు నాకు ఆ పొట్లాం అందించబోయాడు. కాని నేను అలా అనడంతో బల్లమీద ఉంచాడు.

తర్వాత 'ఇంకేమన్నా కావాలాండీ ?' అని అడిగాడు.

'ఏమీ అక్కర్లేదు.' అన్నాను నేను.

ఇతడు వెళ్లబోతూ గుమ్మంలో ఆగి 'ఇప్పుడొచ్చే గెస్టులెవరండీ ?' అని అడిగాడు.

నాకు నవ్వు వచ్చింది. తడబడ్డాను. 'ఎవరా ? ఎవరంటే...ఎవరో ఒకరు వస్తున్నారులే...నువ్వుపో...'అన్నాను.

మునీర్ ముఖం ముడుచుకున్నాడు. అదోక రకంగా దిగులుగా నావంక చూసి గుమ్మందాటి వెళ్లి పోయాడు.

నేను వాటిని లోపలికి తీసుకుపోయాను.

అంతలో మునీర్ ముఖం గుర్తుకు వచ్చింది. పాపం చిన్నబుచ్చుకున్నట్టున్నాడు.

మునీర్‌కు పాతిక యేళ్లుంటాయి. చాల అందమైన వాడు. వాళ్లది అసలు ఈ ప్రాంతం కాదు. కాని అక్కడ అతనికెవరూ లేక యిక్కడికి వచ్చేశాడు. తండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లి కొంచెం ఊహ తెలిశాక పోయింది. ఆమె కూడా పోయాకఇక్కడికి చేరుకున్నాడు. మా యింటి పక్క యింట్లో అతని పినతల్లి పినతండ్రి ఉంటున్నారు. ఆయిల్లు వారిదే. ఇక్కడికి చేరుకుని వారి యింట్లోనే వుంటూ వారికి తాను బరువుగా ఉండరాదని కష్టపడి బతుకుతున్నాడు. ఏం చేస్తున్నాడో ఎవరికీ చెప్పడు కాని, ఏదో మిలటరీ హోటల్లో సర్వరుగా పని చేస్తున్నట్టు అందరికీ తెలుసు.

మా యింటి కుడివైపు అవతలి యింటి పంచలోనే ఉంటాడెప్పుడూ. మాయింట్లో నా కంఠ స్వరం వినిపిస్తే చాలు పాములాగా తలయెత్తి చూస్తాడు. నేను ఎప్పుడైనా ఏదైనా కీర్తన పాడుతూఉంటే గోడపక్కనే నిలబడి వొళ్లంతా చెవులు చేసుకుని వింటూ ఆనందిస్తూ వుంటాడు. నా ప్రోగ్రాం ఏదైనా రేడియోలో వస్తున్నపుడు మాయింటికే

వచ్చి పంచలో కూలబడి వింటూ ఉండిపోతాడు.

'మొత్తం మీద గట్టివాడే...పుట్టిన రోజు కానుకగా గులాబీలు తెచ్చాట్ట' నాకు నవ్వు వచ్చింది.

ముందు గదిలోకి వచ్చి గులాబీల పొట్లాం విప్పి రెండు మూడు పూలు ఫ్లవర్ వాజ్‌లో ఉంచి రెండుమూడు పూవులు తలలో ముడుచుకున్నాను. గడియారం వంక చూశాను.

నాలుగు గంటలకు అయిదు నిమిషాలు తక్కువ. నేను వంటగదిలోకి వెళ్ళి కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసి ఒక గ్లాసుతో మామయ్య గదిలోకి నడిచాను.

ఆయన కాఫీ అందుకుని గుటక వేసి 'శంకర్ రాలేదా యింకా ?' అని అడిగాడు.

'వస్తాడు' అన్నాను నేను.

తర్వాత ఒక్క క్షణం ఆగి 'శంకర్ చాల మంచివాడు మామయ్య ! నేనంటే...' అంటూన్నాను.

'ఆఁ! నువ్వంటే...?' అని ప్రశ్నించాడు ఆయన.

నేను నేల చూపులు చూస్తూ 'నేనంటే అతనికి మహా అభిమానం...నిన్న నేను అతన్ని అడిగాను...ఉరికే పొంగిపోయాడు...నాసంపాదన డబ్బు చూసి ఎవరో ఒకరు నన్ను చేసుకోక పోరు మామయ్యా ! కాని శంకర్ వంటి సహృదయుడు, సంస్కారి అయితే ...' అని చెప్పాను.

'ఇంతకీ ఏమన్నాడు ?' ఆయన కంఠంలో ఉత్కంఠ.

'చాల ఆనందించినట్టు కనిపించాడు. అంతకన్నా కావలసిందేముందని అన్నాడు. ఈ పూట వచ్చి సర్‌ప్రయిజ్ చేస్తానన్నాడు...'

ఆయన కళ్లలో తృప్తి కనిపించింది.

అంతలో గాద్గదికంగా 'అంతా సవ్యంగా జరిగిపోతే బాగుండును. నిశ్చింతగా కళ్లు మూస్తాను.' అన్నాడు.

'అలా అనకు మామయ్యా ! ఏది ఏమయినా నువ్వు పది కాలాలపాటు హాయిగా ఉండాలి....'

ఆయన మంచం మీద వీలుగా సర్దుకుని కూర్చున్నాడు. నేను ఒక్క నిముషం ఆగి ముందు గదిలోకి వచ్చాను. అలా రం గడియారం నాలుగూ ఇరవై ఎనిమిది నిముషాలు చూపి స్తున్నది. అద్దం ముందుకు వెళ్లి నిలబడ్డాను. నావంక నేను మళ్లీ పరిశీలనగా చూసుకున్నాను. అంతలో ఎందుకో వసుంధర గుర్తుకు వచ్చింది. చదువు పూర్తి చేసుకుని తాను అనుకున్న దానిని సాధించింది. కాలేజీ లెక్చరరు అయింది ఇప్పుడెక్కడ ఉన్నదో !

బయట వరండాలో ఎవరో తచ్చాడుతున్న సవ్వడి వినిపించింది.

'ఎవరది ?' అంటూ గుమ్మంలోకి వెళ్లాను.

ఎవరో పదహారేళ్ల కుర్రవాడు నెమ్మదిగా నంగినంగిగా 'ఉమాదేవి గారి యిల్లు ఇదేనా ?' అని అడిగాడు.

నేను 'అవును' అన్నాను.

'ఆమె గారెక్కడ ?' అని అడిగాడు మళ్లీ.

'నేనే. ఏం కావాలి ?'

'శంకరంగారు మీకు దీన్ని యిమ్మన్నారు.' అంటూ ఒక కవరు అందించాడు.

'నువ్వెవరూ ? ఆయన రాలేదేం ?'

'నేను వారి ఆఫీసులో పనిచేస్తుంటానండి... దీన్ని నాలుగున్నరకల్లా మీకు అందించమని ఎటో వెళ్లిపోయా రండీ...ఆయనకు అర్జంటు పని తగిలిందని చెప్పారు.'

ఆ మాట చెప్పి అతడు వెను దిరిగి వెళ్ళిపోయాడు.

నేను గుండెలు చిక్కబట్టుకుని తలుపు దగ్గరగా మూసి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాను. చేతిలో ఆ కవరు బరువుగా అనిపించింది.

దాన్ని టీపాయ్ మీద ఉంచి కొద్దిక్షణాలు దాని వంకనే చూశాను.

దాన్ని వెంటనే తెరిచి చూడాలనిపించలేదు.

కాని క్షణక్షణానికీ పెరుగుతున్న ఉత్కంఠ నన్ను అతలాకుతలం చేస్తున్నది. మెదడు నిండా అర్థం లేని ఆలోచనలు...

చివరకు తెగించి కవరు చించాను. ఒక ఉత్తరం కనిపించింది. వొణుకుతున్న వేళ్ళతో మడత విప్పాను. కళ్ళకు దగ్గరగా ఉంచుకుని చదవ వలసి వచ్చింది. ఏమిటో ఈ మధ్య చూపు మందగించి నట్టు అనుమానంగా ఉంది. ఉత్త రంలోని అక్షరాలమీద నా చూపులు పరుగెత్తాయి. ఉన్నవి పది పంక్తులు. చాల బాధపడుతూ వ్రాసినట్టున్నాయి. చదవడం పూర్తి చేసి దాన్ని టీపాయ్ మీద ఉంచి దాని మీద బరువు వుంచి కుర్చీలో వెనక్కు వ్రాలి చేతివ్రేళ్ళు విరుచు కున్నాను.

కళ్ళలో నీళ్ళు ఉబికి వచ్చాయి. అంతలోనే 'ఎంత నిర్భాగ్యురాలిని !' అనిపించింది.

ఇందులో అతని దోషమేమీ లేదు. నిజమే.

తప్పంతా నాదే.

ఎంత బాధ ఆ ఉత్తరంలో ! ఆ కొద్ది వాక్యాలలోను అతడు పడిన మానసిక క్షోభ ప్రస్ఫుటమవుతున్నది.

'డియర్ ఉమాదేవీ ! మిమ్మల్ని అలా సంబోధించ రాదు. కాని అలాగే సంబోధిస్తున్నాను. మీరు హృదయం

విప్పి నాతో మాట్లాడారు. సంతోషం. స్పష్టంగా విష యం బైటపెట్టారు. నేను మీ అభ్యర్థన విని ఆనందంతో పొంగిపోయి నాట్యం చేయవలసిన సందర్భం అది. మీ వంటి గాయని జీవిత భాగస్వామిని కావడం కంటే నాకూ కోరతగింది లేదు. కాని నేను దురదృష్టవంతుడ్ని. కారణం నాకింతకు ముందే వివాహం కావడం! నాభార్య ఉద్యోగరీత్యా మరొక చోట మా చిరంజీవితో ఉంటున్నది. నేనిక్కడికి బదిలీ అయి వచ్చి ఒంటరిగా ఉంటున్నాను. మళ్లీ ట్రాన్స్ఫర్ కోసం ప్రయత్నిస్తున్నాను. మీ స్నేహం లభించినందుకు ఎంతో ఆనందించాను. మీరు మొన్న చేసిన ప్రసంగం నాలో కలత రేపింది. అది జరిగే విషయంకాదు. కాని ఈ వృత్తాం తంలో నా బాధ్యత ఏమీలేదని గుర్తించి సహృదయంతో మన్నించ ప్రార్థన. ఇన్ని నెలలుగా మన మధ్య వ్యక్తిగత వివరాల ప్రసక్తి రాకపోవడం వల్ల ఇలా జరిగింది. నన్ను క్షమించండి. నేను సెలవు పెట్టి వెళ్లిపోతున్నాను. త్వరలో ట్రాన్స్ఫర్ ఆర్డరు వస్తుంది. మళ్లీ మిమ్మల్ని కలుసుకుంటానని అనుకోను. కాని మనస్నేహం, కొన్ని నెలల పరిచయం, నా జీవితంలో చివరివరకూ గుర్తుంటాయి. ఈకవరులో నా భార్య ఫోటో ఉంచాను.'

క్రింద సంతకం...తేదీ...

నేను అలాగే కుర్చీలో వెనక్కు వాలి వుండి కొన్ని క్షణాల సేపు కళ్ళు మూసుకున్నాను. తర్వాత కళ్లు తెరచి చూద్దునుకదా, ఎప్పుడు వచ్చాడో మావయ్య ఆ ఉత్తరం చదువుతూ కని పించాడు.

నేను డగ్గుత్తికతో 'మావయ్యా' అన్నాను.

ఆయన ఉత్తరం క్రింద పడేసి అదోకరకంగా నావంక చూసి లోపలికి వెళ్లిపోయాడు. ఆ చూపులో అనునయమే

ఉందో, సానుభూతి ఉందో నేను గమనించలేను.

తర్వాత నెమ్మదిగా కవరులోపలి ఫోటో ఇవతలికి లాగాను. విద్యుద్ఘాతం తగిలినట్లయింది.

'మామయ్యా! శంకర్ భార్య ఎవరనుకొంటున్నావు? మన వసుంధరే...' అంటూ లోపలికి వెళ్ళాను.

మామయ్య పక్క మీద ఆయాసంతో వగరుస్తూ పడి వున్నాడు. ఒకచేయి మంచం క్రిందకి వ్రేలాడుతున్నది. గుండెమీద ఒక చేత్తో అదుముకుంటూ విపరీతంగా ఆయాస పడిపోతున్నాడు. కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

నేను ఆదుర్దాగా 'మునీర్...మునీర్' అని కేకలు పెడుతూ వరండాలోకి వెళ్ళాను.

మునీర్ పరుగెత్తుకు వచ్చి గోడపక్కనే నిలబడి 'ఏమిటి?' అని అడిగాడు.

'అర్జంటుగా రిక్షా పిలుచుకురా...మామయ్యను డాక్టరు దగ్గరికి తీసుకుపోవాలి' అన్నాను ఏడుపు ఆపుకుంటూ.

మునీర్ చొక్కా వేసుకుని క్షణంలో రోడ్డుమీదకి పరుగెత్తాడు.

అతని పినతల్లి వరండాలో నిలబడి 'ఏమమ్మా! ఏమయింది?' అని అడిగింది.

నేను కళ్ళు తుడుచుకుంటూ 'మామయ్యకు హార్ట్ ఎటాక్ వచ్చినట్టుంది...' అని చెప్పి లోపలికి వెళ్ళాను.

ఆయన పక్కనే కూర్చుని గుండెలు నిమరసాగాను.

ఆయన అంతలో ఒక్కసారి కళ్ళు తెరిచాడు.

ఆకళ్ళ నిండా దైన్యం...దిగులు...నీళ్ళు...

ఏదో మాట్లాడబోయాడు. కాని మాట పైకి రాలేదు.

నిముషంలో మునీర్ హడావుడిగా వచ్చి 'రిక్షాతెచ్చాను'

అని చెప్పాడు.

ఇద్దరమూ రిక్షావాడి సహాయంతో ఆయనను రిక్షాలో చేర్చి కూర్చోబెట్టాము. నేను పక్కనే కూర్చుని ఆయనను పట్టుకున్నాను.

రిక్షా కదిలింది.

మునీర్ వెనక నుంచి 'నేను సైకిలు తీసుకొస్తాను' అన్నాడు. నేను 'అలాగే. త్వరగా రా' అన్నాను.

నాగుండెలు దడదడలాడుతున్నాయి. కాళ్లలో వణుకు పుట్టుకొచ్చింది. మామయ్య వంక చూశాను. ఆయన కళ్ళు మూతలు పడిపోతున్నాయి. ఆయాసంగా బరువుగా ఊపిరి పీలుస్తున్నాడు.

ఉన్నట్లుండి నామెడచుట్టూ చుట్టూవున్న ఆయన చేయి బిగుసుకున్నది. నాకళ్లలో నీళ్లు — ఎదురుగా ఏమీ కనిపించడం లేదు — రిక్షా సాగిపోతున్నది.

రిక్షా ఆగగానే కాంపౌండరూ, నర్సూ వరండాలోనుంచి మెట్లు దిగి వచ్చి ఆయనను దింపి లోపలికి తీసుకువెళ్లి పడుకో బెట్టారు. వాళ్లిద్దరూ ఒకరి వంక ఒకరు ఎందుకో వింతగా చూసుకున్నారు.

డాక్టరు మరుక్షణంలో వచ్చి ఆయన మీదకి వంగి చూశాడు. నేను కొంగు నోటిలో కుక్కుకుని ఏడుపు ఆపు కుంటూ ప్రక్కనే నిలబడ్డాను.

డాక్టరు అంతలోనే నావంక చూసి 'ప్చ్! అంతా అయి పోయిందమ్మా...రిక్షాలోనే...' అంటూ నిటారుగా నిలబడ్డాడు.

దుఃఖంతో మెలిదిరిగి పోతూ తడబడే అడుగులతో వరండా చివరకు వచ్చి నిలబడ్డాను.

మునీర్ సైకిల్ స్టాండు వేసి లోపలికి వస్తూ 'ఏమ న్నారు డాక్టరు గారు !' అని అడిగాడు.

నేను బావురుమన్నాను.

* * * * *

తర్వాత కాలం నాపాలిట కాలనాగు అయింది. నా ...ఘు విరిగిపోయింది. క్రమంగా, ఉన్న డబ్బంతా హారించుకు ...ంది. నిరంతరం దిగులు... నైరాశ్యం...నన్ను శిథిలం చేశాయి. కచేరీలు కూడా తగ్గిపోయాయి.

అద్దంలో చూసుకుంటే నన్ను చూస్తే నాకే ఆశ్చర్యం వేసింది. తలంతా నెరసిపోయింది. శక్తి ఉడిగిపోయింది. కళ్ళు గాజు బిళ్ళలైనాయి. చూపు బొత్తిగా మందగించి పోయింది. కళ్ళజోడు మారుద్దామంటే డబ్బు కరువై పోయింది. అప్పటికే నాకున్న కొద్దిపాటి నగలూ అమ్ముకున్నాను.

రోజులు గడవటమే కష్టమైపోయింది. కచేరీలు కలికానికక్కూడా లేకుండా పోయాయి.

మునీర్ నిరంతరం నన్ను కనిపెట్టుకుని ఉండేవాడు. నాకోసం తన యింట్లో వారిచేత తిట్లు తినడం కూడా జరిగింది. అయినా అతడు నాయోగక్షేమాలు పట్టించుకోవడం మానలేదు.

ఒకసారి ఎవరినో వెంటబెట్టుకుని వచ్చాడు. వారికొక బార్ ఉందిట. అందులో రోజూ సాయంకాలం పూట మూడు గంటల సేపు పాటలుపాడాలి. డబ్బు ముట్టజెపుతారు. అయితే ఆ పాడవలసిన పాటలు వేరు. సినిమా పాటలు ఎక్కువగా పాడాలి. జనాన్ని అలరించాలి. కాస్త ఆలోచించి అందుకు కూడా సద్దపడ్డాను. కాని ఆవ్యక్తి నన్ను చూసి జడుసుకున్నట్టున్నాడు. ఎక్కువ మాట్లాడకుండానే వెళ్లి

పోయాడు. మునీర్ తలవంచుకున్నాడు.

ఒకనాడు ఒకవ్యక్తి మాయింటికి వచ్చి నాతో మాట్లాడాలన్నాడు.

"సరే! ఏమిటో చెప్పండి ?" అన్నాను ఆయనను కూర్చుని.

ఆయన నెమ్మదిగా ప్రారంభించాడు.

'జగన్నాథం మీకేమవుతాడు ?' అని అడిగాడు.

'మామామయ్యే...' అని చెప్పాను.

'అతనూ నేనూ స్నేహితులం...దాదాపు మూడేళ్ల క్రిందట...' అంటూ ఆగాడు.

నేను ముందుకు వంగి 'మూడేళ్ల క్రిందట ?' అని ప్రశ్నించాను.

ఆయన నేల చూపులుచూస్తూ "నేను అప్పుడిక్కడే ఉండేవాణ్ణి. తర్వాత మా అబ్బాయి దగ్గరికి వెళ్లి పోయాను. మహారాష్ట్రలో ఉండేవాళ్లం ఇన్నాళ్లూ...ఈమధ్యనే మావాడి ఉద్యోగం పోయింది. మళ్లీ ఇక్కడికి చేరుకున్నాం...మాపరిస్థితులు కూడా బాగా లేవు బొత్తిగా. అందువల్ల తెగించి నీతో మాట్లాడదామని వచ్చాను. జగన్నాథం పోయినట్టు నాకు ఇటీవలే తెలిసింది. మేమిక్కడికి వచ్చి కూడా పదిహేను రోజులే అయింది. ఇన్నాళ్లూ ఆలోచించాను. కాని యిక యిప్పుడు తప్పనిసరి అయి నీదగ్గరికి వచ్చాను." అని మళ్లీ ఆగాడు.

'మీరు చెప్పదలుచుకున్నదేమిటో చెప్పండి ... ఫరవా లేదు." అన్నాను నేను.

ఆయన "నువ్వేమీ బాధపడవద్దు. జగన్నాథం అప్పుడు నాదగ్గర డబ్బు తీసుకున్నాడు..." అన్నాడు.

నేనాశ్చర్యపోయాను.

'ఎంత తీసుకున్నాడు ?' అని అడిగాను.

'అయిదు వేలు...ఇదుగో నోటు...' అంటూ ఆయన ులోంచి నోటు తీసి యిచ్చాడు.

నాకు కళ్ళు తిరిగినట్టయింది. నోటు అందుకుని ోడుకోసం వెదికాను. కిటికీలో ఉందది. దాన్ని అందు మొహానికి తగిలించు కున్నాను. అయినా కళ్లకు దగ్గరగా ఉంచుకుంటేగాని అక్షరాలు కవబడలేదు.

అది మావయ్య వ్రాసి యిచ్చిన నోటే. అను లేదు. గుండె గొంతుకలోకి వచ్చినట్టయింది.

ఆయన మెల్లిగా'నేనూ జగన్నాధం స్నేహితులమని చెప్పానుకదా ! నేను రాకనేపోదును. కానీ నా పరిస్థితులు బొత్తిగా తల్లక్రిందులుగా ఉన్నాయి. నేను చాల బాధల్లో ఉన్నాను. మరి...'అంటూ ఆగాడు.

తర్వాత మళ్లీ 'నువ్వు బాధ పడుతున్నావేమో! కానీ అసలు ఉన్న విషయం ఇది. తర్వాత నీ యిష్టం...' అన్నాడు.

నేను నెమ్మదిగా వచ్చి 'మావయ్య ఋణం తీర్చకుండా పోయాడనే చెడ్డపేరు రానివ్వను.' అన్నాను.

ఆయన కుదుట పడ్డట్టు కనిపించాడు. ఎంతయినా డబ్బుకదా ! దాని చూట్టూనే కదా సమాజమూ వ్యక్తులూ అంతా ప్రదక్షణాలు చేస్తున్నది. !

'వడ్డీ కావాలంటే తీసివేసుకుందాం. నీకెక్కువ భారంలేకుండా!' అన్నాడాయన తేరుకుని. 'అక్కర్లేదు. ఈనోటుకు గడువు కూడా ఎక్కువ రోజులు లేదిక ... నాదగ్గర చిల్లిగవ్వ కూడా లేదు. అయినా ఫరవాలేదు. ఈ యిల్లు మావయ్యదే...ఆయన కష్టార్జితం... మీరు మళ్లీ కనిపించండి. లేకపోతే మీ అడ్రసుయివ్వండి. నేనే కబురు చేస్తాను...' అని చెప్పాను నోటుఆయనకు అందిస్తూ.

ఆయన దాన్నందుకుంటూనే నమ్మలేని వాడిలా నావంక చూశాడు.

నేను మళ్లీ "చెప్పానుగా? ఇల్లు అమ్మకానికి పెడ[illegible] లేకపోతే మీరే ఎవరైనా కొనేవారిని తీసుకురండి. అంతా సెటిల్ చేసుకోవచ్చు...' అన్నాను లేస్తూ.

ఆయన 'సరే' అని లేచి 'ధర్మం ఇంకా కుం[illegible]తో నైనా ఉంది...' అనుకుంటూ వెళ్లాడు.

వారంరోజులలోనే అంతా పూర్తయిపోయింది. [illegible]ల్లు అమ్మకం, బాకీ పరిష్కారం, అంతా ముగిసిపోయింది. అంతా అయిన తర్వాత నా దగ్గర చాలా తక్కువ పైకం మిగిలింది. ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయేందుకు కొద్దిరోజులు గడువు యిచ్చారు.

ఆనాడు ఉదయం మొహం కడుక్కుంటూ వుంటే నోటివెంట రక్తం పడింది. కళ్లు తిరిగి నట్టయింది.

మునీర్‌ను సాయం తీసుకుని డాక్టరు దగ్గరికి వెళ్లాను. అప్పటికే మునీర్ పినతల్లి పినతండ్రి నానా రభసా చేసి అతనిని యింట్లో నుంచి వెళ్లిపొమ్మన్నారు. అతడు ఆయింటికి వెళ్లడం మానేశాడు. రోజల్లా చాకిరీ... రాత్రిపూట వరండాలో నిద్ర...

డాక్టరు పరీక్ష చేసి ఎక్సరే తీయించుకు రమ్మన్నాడు. ఆరోజల్లా అదే పని...సాయంకాలం వేళకు మునీర్ డాక్టరు దగ్గరినుంచి ఎక్సరే ఫోటోలు తెచ్చాడు.

'ఏం చెప్పారు?' అని అడిగాను నేను ఆయాసంతో.

అతడేమీ మాట్లాడలేదు. ఫోటోలున్న కవరు బల్ల మీద పడేసి వరండాలోకి వెళ్లి మౌనంగా పడుకుండిపోయాడు. ఎన్నిసార్లు పిలిచినా పలకలేదు. దగ్గరికి వెళ్లిచూస్తే ఏడుస్తున్నట్టనిపించి యివతలికి వచ్చేశాను.

కవరులోంచి ఆ ఫోటోలు తీసి లైటు ఎదురుగా ఉంచి
ూశాను. నాకేమీ అర్థం కాలేదు.

మరునాడు పగలంతా మునీర్ కనపడలేదు. నేను
రు దగ్గరికి వెళ్ళి పరిస్థితి అంతా కనుక్కున్నాను.

రెండుఊపిరి తిత్తులూ చెడిపోయాయి. నిశ్శబ్దంగా
నెమ్మదిగా క్షయ వ్యాధి రెండు ఊపిరి తిత్తులను కబ
మిలి వేసింది. ట్రీట్‌మెంట్ తీసుకుంటే గట్టిగాపూర్తిగా
వుతుందని చెప్పలేము. అదీ దూరంగా రాయవేలూరు

నాకు దాని అర్థం బోధ పడింది. మృత్యువు కూడా
దూరంలోనే వేచి వుంది. నిర్లిప్తంగా నవ్వుకుని ఇంటికి
న్నాను.

అరాత్రి అంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా ఏ అలికిడి లేదు. కీచురాళ్ళు మాత్రం సన్నగా రొదచేస్తున్నాయి. నేమ ఉన్న కొద్ది బట్టలూ మూటకట్టుకుని తీరికగా పడుకున్నాను. చాపమీద.

గుమ్మం ముందు వరండాలో మునీర్ పడుకుని ఉన్నాడు. నిద్రపోతున్నాడో లేదో తెలియదు.

తెల్లవారగానే చూస్తే మునీర్ వరండాలో లేడు. అదీ మంచిదే అనుకున్నాను.

నెమ్మదిగా మూట అందుకుని వరండా దిగి వాకిట్లోకి వచ్చాను. ఒక్కసారి వెనుదిరిగి చూశాను. దుఃఖం పొంగి వచ్చింది. కాని తమాయించుకుని అడుగులు ముందుకు వేశాను. వీధి చివరలో రిక్షా కనిపిస్తే ఆపి ఎక్కి కూర్చుని 'బస్టాండుకు పోనివ్వు' అన్నాను.

ఉదయంవేళ. ఇంకా చీకట్లు చెదిరిపోలేదు. ఎక్కడో పెందలాడే లేచిన కాకి కూస్తున్నది.

బస్సులో ఎక్కి టిక్కెట్టుకొని కూర్చున్నాను. మరు నిముషంలో బస్సు కదిలింది. బస్సు కదులుతూండగా ఏ గాలిలాగా లోపలికి వచ్చాడు మునీర్ 'వెళ్లిపోతున్నారా ? నే వస్తాను''...అంటూ.

'ఎక్కడికి !' అని అడిగాను ఆశ్చర్యంతో.

'మీరెక్కడికి వెళితే అక్కడికి' అన్నాడు.

# మునీర్ కథనం

నాపేరు మునీర్.

మునీర్ అహమద్.

నాకు చిన్న తనం నుంచీ నిద్రలో కలలెక్కువగావచ్చేవి.

కలల్లో పెద్ద పెద్ద పాలరాతి భవనాలు కనిపిస్తాయి. లెక్కలేనన్ని మెట్లు ఎక్కి బ్రహ్మాండమైన ద్వారం దాటి లోపలికి పోతే లోపల అంతా పాలరాతి శిల్పంతో కూడినగోడలు విశాలమైన గదులు...వాటిలో రంగు రంగుల గాజు బుడ్లు వెలుగుతున్న దీపపు సెమ్మెలు...

అక్కడ మాపెద్దలెవరో మాతాతలూ ముత్తాతలూ బాలీసుల కానుకుని హుక్కాలు పీలుస్తూ విలువైన దుస్తులు ధరించి కూర్చుని వుంటారు. ఎదురుగా సారంగి వాయిస్తూ కనులు అరమోడ్చి తన్మయత్వం చెందుతుండాడొక సంగీత విద్వాంసుడు. సారంగి వాద్యపు మెత్తని మృదువైన నాదం అలలు అలలుగా విశాలమైన గదినిండా కమ్మి శ్రోతలను ఉక్కిరి

చిక్కిరి చేస్తుంటుంది. నేసుకూడ వెళ్లి అక్కడ కూర్చుని హుక్కా చేతిలోకి అందుకుంటుండగా కల అయిపోతుంది.

మెలకువరాగానే చినుగుల చాప, పెచ్చులూడి పోయిన ... ల, ఉన్నట్టుండి ఏక్షణంలోనైనా నేలకూల వచ్చుననిపించే ... ంటి పైకప్పు, మందంగా గుమ్మంలో వెలిగే కిరసనాయిలు ..., ఇవన్నీ కనిపించి మనసు చివుక్కుమంటుంది. ఆ కల ...డే అయిపోయిందే అన్న దిగులుతో మళ్లీ తెల్లవారేవరకూ ...పట్టదు.

తెల్లవారగానే నీరసంగా పనులన్నీ ముగించుకుని మురికి పట్టిన కాకీ చొక్కా లాగూ తొడుక్కుని కొన్ని గంజి తాగి అమ్మతో చెప్పి మైలుదూరం నడిచి షాపుకు వెళ్తాను. అమ్మ నేను చెప్పింది విని సన్నగా 'ఊఁ' అంటుంది. అంతే. అదినాకు వినబడదు. ఆమె అలా అంటుందో లేదో కూడా నాకు తెలి యదు. నెమ్మదిగా తల ఊపడం చూసి అలా అని వుంటుం దని అనుకుంటాను.

షాపుకు వెళ్లేసరికి రోజూ మేస్త్రీచేత చివాట్లు తప్పవు. ఎంత పెందలాడి వెళ్లినా 'ఏరాభటూ చోర్ ! ఇంత పొద్దెక్కి వచ్చావు ? ఇక్కడ పని పేరుకుపోతున్నదె...ఎవడు చేస్తాడను కున్నావు నీతాత ? తొరగారా...ఆ రెంచి అందుకో...' అంటూ కళ్లెర్ర జేసేవాడు.

అతనిది భారీ విగ్రహం. దయ్యపు కళ్లలాగా కొరు వుల లాటి కళ్లు...అతడు మామూలుగా మనవంక చూస్తేనే గుండెదడ. ఇక కోపంగా చూస్తే చెప్పాలా ? వెన్నుపూసలో నుంచి సన్నగా వొణుకు పుట్టుకొస్తుంది. ఆ కంగారులో అతడు రెంచి యిమ్మంటే కటింగ్ ప్లేయర్ అందివ్వడం...

ఇంకా చివాట్లు తినడం...ఇంకా తప్పులు చేయడం, వీపు మీద రెండో మూడో ఘణుగు దెబ్బలు తినడం ... ఇది అంతా మామూలే.

అతడు మాటిమాటికి 'పనిదొంగలు...తింటానికి తప్ప మరెందుకూ పనికిరారు ' అంటూ ఉంటాడు.

ఆరోజు నాకు బాగాగుర్తు.

సైకిలు ట్యూబును బొచ్చెలో నీళ్లలో ముంచి ఎక్కడ ఉందా అని పరిశీలిస్తున్నాను. ఉదయం ఇంటి తిన్న చద్దిఅన్నం మెతుకులు తప్ప సాయంకాలం మూడు వరకూ మరేమీ కడుపులో పడలేదు. పైగా మధ్యలో మూడు సార్లు మేస్త్రీచేత గట్టి తిట్లే తిన్నాను. బాటులో ఉంటే కొడతాడేమోనని దూర దూరంగా తప్పి తిరుగు తున్నాను. ఇవాళ నామీద మరీ మండి పడుతున్నా డెందుకో...

అంతలో ఎదురు షాపులో రేడియో పెద్దగా పెట్టా రెవరో. ఉన్నట్టుండి 'ఆయ్ మాలిక్ ! తేరేబందేహమ్...' అంటూ పాటవినిపించింది.

ట్యూబు అలాగే నీళ్లలో నొక్కి పట్టి వినసాగాను. చుట్టూ ఆపాట తప్ప అంతా నిశ్శబ్దం. పైన ఆకాశంలో నల్లని మబ్బులు...ఉండి ఉండి సన్నని మెరుపు తీగ...

ఆ స్వరం గాలిలో నిండి నామనసులోకి జొరబడి నా ఆత్మను అలరిస్తున్నది. వింత అనుభూతికి లోనై బాహ్య ప్రపంచాన్ని మరిచిపోయి అలాగే నిశ్చేతనంగా కూర్చుండి పోయాను.

పాట పూర్తి అయ్యే వరికి నాకళ్ల వెంట నీళ్లు ఉబికి వచ్చాయి. తర్వాత కొద్ది క్షణాల సేపు ఆస్వరమే నన్ను కమ్మి

టని ఉండిపోయింది. కదలక మెదలక అలాగే రాయిలా
ర్చుండి పోయాను.

వీపుమీద 'ధబ్బుమని' గుద్దు పడటంతో తెలివివచ్చింది. దెబ్బ కొట్టడమే కాక వెంటనే నాచెవులు రెండూ పట్టు గోళ్ళ ప్రయోగిస్తూ నెత్తురు వచ్చేలా పిండుతున్నాడు

నేను రెండు చేతులతో అతని చేతులను విసురుగా వి[illegible] వి కొట్టాను. చెవులు విడిచి కళ్ళు పెద్దవి చేసుకుని చూ[illegible]డు. నేను అలాగే నిలబడ్డాను. నాపిడికిళ్ళు బిగుసు కున్నాయి.

'ఏరా ! నీకేమైనా పిచ్చి పట్టిందా! ఎదురు తిరుగుతున్నావు...' అన్నాడతడు బొంగురు గొంతుకతో క్రూరంగా.

'పిచ్చికాదు...దయ్యం పట్టింది...నాపంటి మీద చెయ్యి వేశావో '... అని అరిచాను.

మిగిలిన పని వాళ్ళూ ఇతరులూ మావంకనే చూస్తు న్నా[illegible]. ఇది ఘోర అపచారమైనట్టు... 'పనివాడు యజ మా[illegible]కి ఎదురు తిరగడమా ? ఎంత ఘోరకలి' అంటున్నా డొకడు.

'ఎంటి మీద చెయ్యి వేస్తే ?' అని నిగ్గదీశాడుమేస్త్రీ.

'వేసి చూడు...' అన్నాను కసిగా...

'ఆహా...వేస్తే ఏంచేస్తావు ? '

'అదే చూడ మంటున్నాగా ? '

అతడు రెండడుగులు ముందుకు వేశాడు.

నేను సైకిల్ చెయిన్ అందుకున్నాను.

అతడు నామీదికి రాబోయాడు. చెయ్యివిసిరి గొంతు పట్టుకోబోయాడు.

అప్రయత్నం సైకిల్ చెయిన్ గాల్లోకి లేచింది. ఆవిసురుకు అతనికి ముంజేతుల పైన గట్టి దెబ్బే తగిలింది. పంతో బలిసిన పందిలాగా అరిచాడు. బొబ్బలుపెట్టాడు.

'పట్టుకోండి గాడిద కొడుకుని. ఇవాళ వాడి అం తేలుస్తాను !' అని అరిచాడు.

ఇద్దరు ముగ్గురు నాలాటి పనివాళ్లు నామీదికి రా యారు.

సైకిల్ చెయిన్ రివ్వున తిప్పుతూ అందర్నీ గొడుతూ షాపు ముందు విశృంఖల వీర విహారం చేశాను.

దానితో అందరూ వెనక్కు తగ్గారు.

ఉన్నట్టుండి చెయిన్ క్రింద పడేసి బాణం లాగా పరుగెత్తాను.

వెనక నుంచి మేస్త్రీ 'పట్టుకోండి '... అని అరుస్తున్నాడు. నాకంటే వయసులో పెద్ద వాళ్లయిన యిద్దరు కుర్ర వాళ్లు నావెనక పడ్డారు.

కాని నేను వారికి అందలేదు. మలుపు తిరిగి యింకా వేగంగా పరుగెత్తి రెండు మూడు వీధులు దాటి పోయి ఒక స్నేహితుడి యింట్లో దూరాను.

వాడి పేరు అబ్దుల్లా. తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. ఇద్దరం కలిసే అయిదో క్లాసు వరకూ చదువుకున్నా, మానాన్న చచ్చి పోవడం వల్ల నాచదువు చట్టు బండలై పోయింది. వాడు చక్కగా చదువుకుంటున్నాడు.

వాడు నన్ను చూసి ఆశ్చర్యపోయాడు.

'ఏమిటి ? ఇప్పుడొచ్చావు ?' అని అడిగాడు.

నేను వాడి పక్కనే చాప మీద కూలబడి ''ఏమీ లేదు. మేస్త్రీ కొట్టాడు...' అన్నాను.

'కొడితే ?'

'కొడితే ఎదురు తిరిగాను. పారిపోయి వొచ్చేశాను.

వాడి కళ్ళ బడితే ఊరుకోడు. ఏమీ తెలియదు.
నేనసలు ఇంటికే పోలేదు.'

'పోన్లే...కాస్సేపు ఇక్కడే ఉ

'అట్లాకాదు. వాడు మా అమ్మతో లెక్కలే

డీలు చెబుతాడు. ఆమె వాడిమాటే నమ్మి నాగురించి
కుస్తూ కూర్చుంటుంది. నువ్వొక సారి మా యింటికిపోయి
ందుగా ఇదంతా చెప్పిరా. నాదేమి తప్పులేదని చెప్పు...
డు రాక్షసుడు. ఇదుగో, నా చెప్రలు చూడు...రక్తం వచ్చేలా
పీకాడో...'

'సరే' అన్నాడు అబ్దుల్లా.

అలాఅని అతడు వెళ్ళి పోయాక ఆపిస్సు వరండాలో
మీద గోడకు జారి కళ్ళు మూసుకున్నాను.

లోపల అబ్దుల్లా తమ్ముడు రేడియో పెట్టినట్టు
న్నాడు. హఠాత్తుగా 'తూగంగా కీ మౌజ్‌మై జమునా కా
ధారా' అంటూ పాట వచ్చింది.

కల లోకి జారిపోయాను.

కలలో బ్రహ్మాండమైన పాలరాతి భవనం... తెల్లని
గోడలు. విశాలమైన హాలు...రంగు రంగుల గాజు బుడ్లు
ఉగుతున్న దీపపు సెమ్మెలు...

ఎంత సేపు నిద్రపోయానో తెలియదు. ఉలిక్కి
పడి లేచేసరికి అబ్దుల్లా నన్ను తట్టి లేపుతున్నాడు. వాడి
ముఖం గంభీరంగా ఉంది. ఎందుకో భయపడుతున్నట్టు కని
పించాడు. అబ్దుల్లా పెద్ద అన్నయ్య ముప్పై ఏళ్ల వ్యక్తి
కూడా అక్కడే ఉన్నాడు.

ఆయన చెయిచాపి 'రా... లేచిరా... యింటికిపోదాం'
అన్నాడు. ఆయన కంఠం బరువుగా దిగులుగా ఉంది.
నేను శంకిస్తూ లేచాను. ఆయన నాచెయ్యి పట్టు

కుని నడిపించు... తీసుకుపోయాడు. వీధి మొదట్లో వుండ
గానే దూరం... మాయింటి ముందు చేరిన జనం క...
పించారు.

అబ్దుల్లా నా పక్కనే నడుస్తూ నెమ్మదిగా "మీ...
చచ్చిపోయిందిరా' అన్నాడు.

* * * * * * * *

ఆతర్వాత మా పిన్ని గారి దగ్గరికి వచ్చాను.

ఆమె మాఅమ్మకు చెల్లెలు.

'తల్లి పోయిన నిర్భాగ్యుడనని' వాళ్లు నను...
భూతితో చూసేవారు.

నేను ఊరికే ఉండలేక పోయాను. తిరిగి తిరి...
ళ్లకు ఒక ఉద్యోగం సంపాదించాను.

ఒక మాంసాహారపు హోటల్లో సర్వర్‌గా కు...
ఒళ్లు దగ్గర పెట్టుకుని జాగ్రత్తగా పనిచేసే వాణ్ణి. ...
మాని నన్ను ఆదరంగానే చూసేవాడు. నన్ను నమ్మి చ...
ముఖ్యమైన పనులే అప్పగించేవాడు. ఆ పనులు అతి జా...
త్తగా చేసిపెట్టే వాణ్ణి.

సంవత్సరాలు గడిచాయి...

ఇంటి పక్క పొడవైన వరండాలో పడుకుంటూ...
వాణ్ణి. ప్రహరీ పక్కన ఒక గులాబీ చెట్టు, మరో...
తెల్లని వెన్న ముద్దల్లాటి పూలు పూచే నంది వర్ధనం చెట్టు...
ఉంటాయి.

కలలు మారలేదు. అవే అందమైన కలలు...చిత్ర
విచిత్ర వాద్య సంగీతం ఆత్మను అలరింపజేస్తుండేది. అపు
రూపమైన గంధర్వ కంఠాలు అద్భుత గానంచేస్తుండేవి.

మా ప్రహరీ పక్కన పెంకెలాటి చిన్న అందమైన
యిల్లు...



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M121 |
| పుస్తకం పేరు | నవలా స్నేహ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 103 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |